# విషయానుక్రమణిక

## 29 మార్చి 1950





భారతదేశం రిపబ్లిక్ అయిన అనంతరం మొట్టమొదటిసారిగా యీనెల 19న ఢిల్లీలో గవర్నర్ల, రాజప్రముఖులసభ జరిగింది. దీనికి డా॥ రాజేంద్రప్రసాదు అధ్యక్షత వహించారు. ఈ సభకు ప్రధాని నెహ్రూ, ఉపప్రధాని పటేల్ కూడ హాజరయ్యారు.




| | | |
|---|---|---|
| సంవత్సర చందా<br>రు 12-0-0<br><br>విడిప్రతిక<br>4 అణాలు | **ప్రతిబుధవారము ప్రకటింపబడును.**<br>ఒరు లేయవి యొనరించిన నరవర! యప్రియము తనమనంబున కగు దా<br>నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్<br>(మహాభారతము)<br>**Founder K NAGESWARA RAO** | సంపుటము **42**<br><br>సంచిక **30** |

వికృతి సంవత్సర చైత్ర శుద్ధ దశమి బుధవారము


ఇటీవల ఢిల్లీలో జరిగిన పారిశ్రామిక ప్రదర్శనాన్ని సందర్శించుచున్న
ప్రధాని నెహ్రూ, ఆయన కుమార్తె శ్రీమతి ఇందిరాగాంధీ



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ మార్చినెల 29-వ తేది బుధవారము

# సంస్మరణము

రేపు కాశీనాథుని నాగేశ్వరరావుగారి వర్ధంతి. విశ్వదాత మనలను వీడి ఒక పుష్కరము గడిచినది. ఈ పన్నెండేండ్లలో వారి జీవితములో కృషిచేసిన కొన్ని ఆశయములు సిద్ధించినవి. భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించినది. కాని ఆంధ్రరాష్ట్రము సిద్ధించలేదు అస్వాతంత్ర్యములోని కష్టము లేవో వానిలో పెక్కులు రాష్ట్రసిద్ధి లభించనందున, తెలుగులకు అట్లే మిగిలిపోయినవి.

దేశములో స్వతంత్రసమరము సాగుచున్నన్ని నాళ్ళును తెలుగునాయకులకు యావద్భారతదేశములో గౌరవప్రతిష్ఠలు మెండుగా నుండెడివి. తెలుగువారిపట్ల మహాత్ముని మొదలు, నేటి భారతఅధినేతలైన నాయకులందరికీ, ఆదరగౌరవములు అధికముగ నుండెడివి. స్వతంత్రయుద్ధములో, నాగేశ్వరరావుగారితో సాటివారైన తెలుగునాయకులన్ననూ, భారతదేశమంతటిలోనూ ఎక్కువగా త్యాగ, సాహస, కార్యదీక్షాపరత్వములతో కాంగ్రెస్ ఉద్యమములకు దోహదమొసంగిన తెలుగుజాతియన్ననూ, కాంగ్రెస్‌నాయకులకు అభిమాన మెక్కువగ నుండెడిది. ఆ అభిమాన ఆదరములు సన్నగిల్లుట కన్నార జూడనందుకు నాగేశ్వరరావుగారు ధన్యులేమో యనే యనుకొనవలసి వచ్చుచున్నది. కాని నేటి ఆంధ్రనాయకులనందరినీ, ఆయన తన జీవితకాలములో సామనస్యముతో సమన్వయ మొనర్చుకొనివచ్చినట్లుగా, ఈనాడును తీసుకొనిరాగలందుకు ఆ సర్వజనహితుడు లేడేయని తెలుగుప్రజ విచారించవలసి వచ్చుచున్నది.

ఆంధ్రరాష్ట్రవిషయములో, తెలుగు ప్రజను, తెలుగునాయకులను, తుదకు మద్రాసుప్రభుత్వమును కూడ, చాలా చిన్నచూపుతో, నిర్లక్ష్యముతోనే చూచి, వ్యవహరించినట్లు వ్యవహరించినది భారత కేంద్రనాయకత్వము. నాగేశ్వరరావుగారివంటి నాయకుడే ఉన్న తమిళులతో ఆంధ్రులకు సామరస్యము కుదురలేదన్నమాటయే కాక ఆంధ్రులలో ఆంధ్రులకే సామరస్యము కుదురలేదన్న, మిషలను ప్రయోగించుటకు కేంద్రప్రభుత్వమున కాస్కారముండెడిది కాదు.

మద్రాసువచ్చినప్పుడు మహాత్మునకు నాగేశ్వరరావుగారు తమిళులలో తెలుగులలో భేద మెరుగవలసిన స్థితియే కల్పించలేదు. ఆంధ్రఉద్యమమునకు అగ్రస్థానమునందుండియు, తమిళులలోగాని ఆంధ్రనాయకులలోగాని, పరస్పరవైమనస్యములు రానీయకుండనే ఆయన ఉద్యమముల నడిపించినాడు. ఆయనకువలెనే, అటు అధినేతలకునూ, ఇటు ప్రజలకునూ, అకలంకమైన గౌరవమునూ, అవ్యాజప్రేమనూ, సంపాదించుకోగలవారై, మన నాయకులు వ్యవహరించిన తప్ప, తెలుగువారికి భారతదేశ ప్రభుత్వములోగాని, ప్రజలలోగాని, ఒక స్థానమును, గౌరవమును, లభింపజాలవు. తెలుగువారన్న తక్కువవారిలో నాటి నాటికి ప్రబలుచున్న తృణీకారము, నిర్లక్ష్యము అంతరించవు. నాగేశ్వరరావుగారి కాస్థానమేల దేశములో కలిగినదో, ఆయనతో సంపూర్ణపరిచయమున్న ఈనాటి మన నాయకులందరూ ఎరుగుదురు. దేశక్షేమమును మించిన స్వార్థమేదియూ విశ్వదాత ఏనాడునూ ఎరుగడు. పరులతో, అభిప్రాయభేదములు కలిగినపుడు పరుల అభిప్రాయమును సానుభూతితో అవగాహన మొనర్చుకొనుచు, శాంతసామనస్యవిధానములో అందరినీ కూడగట్టుకొనిరాగల్గిన నేర్పు ఆయనలో కలదని మన నాయకులందరూ గుర్తించియుండిరి. నేడా పద్ధతి నవలంబించగల్గుటకు మన నాయకులు కృషిచేయగల్గినచో, తమకు గురుతుల్యులగు నాగేశ్వరరావుగారి యాత్మకు శాంతి కల్పింపనేర్తురు. భారతదేశములో ఆంధ్రులకు యథాస్థానమును సమకూర్చగలుగుదురు.

# అరాచకశక్తుల నిర్మూలనము

ఆంధ్రదేశములో, ముఖ్యముగ తెలంగాణాకు సంశ్లిష్టముగ నున్న జిల్లాలలో ప్రజల ప్రాణములకు, ఆస్తిపాస్తులకు ఎట్టి రక్షణ లేదని గత సంవత్సరముగ ఆ ప్రాంతములో జరుగుతున్న సంఘటనలు ప్రకటించుచున్నవి. తెల్లవారితే ఏ ప్రాంతములో ఎవరికి ఏ ప్రమాదము జరుగునో ఊహించుటకైనను సాధ్యముగాకున్నది. ప్రభుత్వము పోలీసుబలమును ఎంత ఎక్కువ చేసినను సంఘటనలను నివారించుట సాధ్యముగాకున్నది. హత్యలు, దహనములు, దోపిళ్లు హఠాత్తుగ జరుగుచున్నట్లు కన్పించినను, అట్టి అకృత్యములను జరుపుచున్నవారు ముందుగ అన్ని ఏర్పాట్లు చేసుకొనే ఈ చర్యలు జరుపుచున్నట్లు స్పష్టమగుచున్నది. పోలీసులకు మాత్రము ముందుగ తెలియుటలేదు. ఇందుకు అపరాధపరిశోధకశాఖసిబ్బందిని వృద్ధి చేయుట అవసరము. రాష్ట్రశాసనసభయందు "పోలీసు పద్దు" పై జరిగిన చర్చలో కొందరు సభ్యులు ఈ విషయమై చేసిన సూచనను ప్రభుత్వము విశేషశ్రద్ధతో పరిశీలించి సాధ్యమైనంతత్వరలో అమలు జరుపవలసియున్నది.

రాష్ట్రమున అరాచక, విధ్వంసక శక్తుల నిర్మూలనమునకు ప్రభుత్వము తీవ్రచర్యలు తీసుకొనుచున్నదనుట నిస్సందేహము. అట్టి తీవ్రచర్యల ఫలితముగ కొందరు అమాయకులు నష్టపడుచున్నారను విషయము కూడ యథార్థమే. కాని ప్రజలు పోలీసుసిబ్బందితో మనస్ఫూర్తిగ సహకరింపకపోవుటవలన ఇట్టి ప్రమాదములు ఎక్కువగుచున్నవికూడ. అయితే ప్రజలకు తగిన రక్షణ లేనికారణమున ప్రాణముపై ఆశ వదులుకొని గాని పోలీసులతో సహకారముచేయుట సాధ్యముగాకున్నది. ప్రజలు కొందరు కొన్నిప్రాంతములందు అధికారులతో సహకరించుచుండవచ్చును. అట్లని రాష్ట్రముమొత్తముమీద ప్రజలు ఈ అరాచక, విధ్వంసకశక్తుల నిర్మూలనలో ప్రభుత్వాధికారులతో పూర్తిగ సహకరించుచుండిరని చెప్పుటకు వీలులేదు.

సామాన్యప్రజలవిషయ మటుంచి కాంగ్రెస్‌వాదులే అధికారులకు తమ విధ్యుక్తధర్మనిర్వహణలో సహకరించకపోగా, అనవసరప్రమేయము కల్గించుకొని అవరోధములను కల్పించుచున్నారను ఆరోపణలు పూర్తిగ నిరాధారములని చెప్పుటకు వీలులేదు. అరెస్టు చేయబడినవారిని విడుదల చేయించుటలోనేమి, ఈ విధ్వంసకచర్యలతో సంబంధము లేకపోయినప్పటికిని తమకు ప్రత్యర్థులైనవారిని అకారణముగ అరెస్టు చేయించుటలోనేమి కాంగ్రెస్‌వాదులు ఎట్టి భూమికను నిర్వహించుచుండిరో కాళేశ్వరరావుగారికిగాని, విశ్వనాథముగారికిగాని తెలియకపోలేదు. అట్లే కాంగ్రెస్‌వాదులలో ప్రబలిన స్పర్థలు ఈ అరాచకశక్తుల విజృంభణకు తోడ్పడుట లేదని కృష్ణాజిల్లాసభ్యురాలు శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు చెప్పినపుడు వారు పూర్తిగ యథార్థమును తెలుపలేదని వారికి, వారి ప్రసంగమును విన్న అసెంబ్లీసభ్యులకును తెలియకపోలేదు

పోలీసులతో సహకరించుటయన వారి అధికారచర్యలలో ప్రమేయము కల్గించుకొనుట మాత్రము గాదు. అరెస్టు అయినవారిని విడిపించువిషయమున, పార్టీస్పర్థలుకారణముగ అమాయకులను అరెస్టు చేయించుటలోగాని కొందరు కాంగ్రెస్‌ప్రముఖులు ప్రదర్శించుచున్న ఆసక్తి నేరస్థుల ఆచూకీతీయుటలో నేరాన్వేషణలో తోడ్పడిన ఎక్కువ ప్రయోజనకరముగ నుండగలదు. సంఖ్యాబలమునందేగాక, ప్రజలలో విశేషప్రాపకము కల్గియుండుటలోకూడ ఈ అరాచకశక్తులను మించియున్న కాంగ్రెస్‌వాదులు, విశేషాధికారము గల ప్రభుత్వాధికారులు కూడ చేరి ఈ అరాచకశక్తులను నిర్మూలింపలేకపోయిరన్న వీరిద్దర్ని మించిన శక్తి, ప్రజలలో ప్రాబల్యము ఆ అరాచకశక్తులకే యుండియుండవలెను.

రాష్ట్రములో శాంతి, భద్రతలను సంరక్షించుటకు, అరాచకశక్తులను నిర్మూలించుటకు ప్రజలకు విరివిగ ఆయుధములను సప్లయిచేసినందువలన ప్రయోజనము లేదు. ప్రభుత్వము ఈ కార్యక్రమమును అమలు జరుపుటలో ఎక్కువ జాగ్రత్తతో వ్యవహరింపవలసియుండును. ఈ అరాచకశక్తులను నిర్మూలించుటకు ప్రస్తుతప్రభుత్వవిధానము కాంగ్రెస్‌వాదుల వైఖరి పూర్తిగ మార్పుచెందవలసియుండును. స్వ, పరభేదము లేక, శాంతిస్థాపనే లక్ష్యముగా కాంగ్రెస్‌వాదులు, అధికారులు ప్రవర్తించిన అరాచకశక్తుల నిర్మూలనము అంత కష్టసాధ్యము గాదు.

# మనరాష్ట్రం, మనదేశం

## కమ్యూనిస్టుల దాడులు



ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుల అల్లర్లని గురించి దేశమంతటా అల్లరయింది. ఒక్క ఆంధ్రదేశంలో మినహా భారతదేశం అంతటా కమ్యూనిస్టుప్రమాదం అణిగిపోతుందని సర్దార్ పటేల్ పార్లమెంటులో అన్నారు. దీనికి కారణం ఆంధ్రదేశంలో నాయకుల్లు కమ్యూనిస్టుప్రమాదంకంటె ఆంధ్రరాష్ట్రసంపాదనపట్ల అధిక శ్రద్ధవహించడమే నని పటేల్ అన్నారు. కమ్యూనిస్టుల్ని అణచడంలో నాయకులు, ప్రజలు ప్రభుత్వానికి తోడ్పడ్డం లేదన్నారు.

పటేల్ గారిమాట లన్నందుకు ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు కొందరు చెన్నరాష్ట్రశాసనసభలో అసంతృప్తి ప్రకటించారు. ఈ శాసనసభలో పోలీసుశాఖ డిమాండ్ పైన చర్చ జరిగినప్పుడు ఈవిమర్శలు, ప్రతివిమర్శలూ వచ్చాయి. కొందరు ప్రజలు సహకరిస్తూనేఉన్నారు కాని ప్రజలకి ప్రభుత్వమే తగిన సంరక్షణ ఇవ్వలేకపోతున్నదన్నారు. కొందరు ప్రజల సహకారం లేనందువల్ల పోలీసులు కమ్యూనిస్టుల్ని అణచలేకపోతున్నా రన్నారు. కొందరు ఈ పరిస్థితులికి ప్రధాన హేతువు కాంగ్రెస్ వాదుల్లో ప్రబలిన విరోధాలన్నారు. కొందరు కాదన్నారు.

ఈ వాదాల్లో నిజానిజా లెలా ఉన్నప్పటికీ ఒక్క విషయంమాత్రం స్పష్టం. మూడు నాలుగువందలమంది సాయుధులైన కమ్యూనిస్టులు దేశంలో భయాన్ని వ్యాపింపచెయ్యకలుగుతున్నారు. ఈమధ్య రోజు రోజుకీ వారి చేతుల్లో అనేకులు హతమౌతున్నారు. పోలీసులు వారిని సంరక్షించలేకుండా ఉన్నారనే మాటను అంగీకరించక తప్పదు. పోగా కమ్యూనిస్టుల తుపాకీలకి పోలీసు లెంతమంది గురైనారో మాత్రం తెలియడంలేదు.

ఏరోజున ఏగ్రామంపైన కమ్యూనిస్టులు దాడిచేస్తారో తెలియదు. తీరా దాడి జరిగి కొందరు మరతుపాకులికి గురైనతరవాత పోలీసుదళాలు, డి. యస్. పీలూ, డి. ఐ. జీలూ పరుగులెత్తడం జరుగుతోంది. పోలీసులికి సమాచారం అందచేసేవారిపైన కమ్యూనిస్టులు పగతీర్చుకుని వెళ్లినఅనంతరం, పోలీసులు వెళ్ళి కమ్యూనిస్టుల అజ కనిపెట్టి చెప్పలేకపోయినవారిలో కొందర్ని చితకొట్టుతున్నారు. పోలీసులికి సమాచారం తెలిపేవారికి పోలీసులవల్ల రక్షణ లభించడంలేదు. వారు కమ్యూనిస్టులబారినుంచి తప్పించుకోలేకపోతున్నారు. ఆ తరవాత పోలీసులవల్ల దెబ్బలు తప్పడంలేదు. పరిస్థితి ఇల్లా ఉన్నందువల్ల ప్రజల్లో భీతి తీవ్రంగా వ్యాపిస్తోంది పోలీసుశాఖ సి. ఐ డి. లు ఉండికూడా కమ్యూనిస్టుల అజ ఎందుకు కనిపెట్టలేకపోతున్నారు?

కమ్యూనిస్టుముప్పు నెదుర్కోడానికి గాను ప్రతిఅయిదుమైళ్ళకీ ఒక్కొక్క పోలీసుస్థావరం స్థాపించగలరనీ, పోలీసు సిబ్బందిని హెచ్చించగలరనీ ప్రభుత్వం ప్రకటించింది ఓగిరాలలో పోలీసుస్టేషన్ ఉండికూడా ఆ ఊరిపైనే కమ్యూనిస్టుల దాడి జరిగినప్పుడు పోలీసు లేం చెయ్యగలిగారు? ప్రజల్ని ఒకవంక తాము సంరక్షించలేక ప్రభుత్వంతో వారు సహకరించలేదనడం అన్యాయం. సహకరించడంలేదని ప్రజల్ని నిందించడం సులువే కాని అటువంటి నిందలవల్ల ప్రయోజన మేమీ ఉండదు. అక్కడి పరిస్థితులు సరిగ్గా అవగాహన కాకపోతే ఇటువంటి నిందలు వస్తాయి.

అవసరమైన ఊళ్లలో ప్రజలకి ఆయుధాలివ్వడానికి పోలీసుశాఖకు ఆక్షేపణ ఉండదని ఇన్స్పెక్టర్ జనరల్ -అన్నారు కాని దీనివల్ల ముప్పుంది. దుర్బలమనస్కుల చేతుల్లో ఆయుధాలు శత్రువులకే బలం. ఎక్కడ దాడిచేసినా కమ్యూనిస్టులు ముందుగా దోచుకునేవి ఆయుధాలు, తరవాత ధనం. ప్రజలకి ఆయుధాలిస్తే కమ్యూనిస్టులికి ఆయుధాల కొరత పూర్తిగా తీర్చినట్లవుతుంది. అదీకాక కాంగ్రెస్ వాదుల్లోనే ముఠాలమధ్య కక్షలు తీవ్రంగా పెరిగిపోయిన ఈ రోజుల్లో వారికి ఆయుధాలిస్తే, వానిని వారు కమ్యూనిస్టులపైన ప్రయోగిస్తారనే గారంటీ లేదు. కాంగ్రెస్ కే చెందిన ప్రత్యర్థివర్గంవారిపైన ప్రయోగించబడితే ఆశ్చర్యపడనక్కరలేదు. ఎవరో కొంతమంది మినహా కాంగ్రెస్ వాదులు గాంధీజీ అహింసాసిద్ధాంతాన్ని 1947 ఆగస్టు 15 తోనే మరిచిపోయారు. ప్రత్యర్థులపైన పగతీర్చుకోడానికి వారిని కమ్యూనిస్టులనితిట్టి పోలీసుల కొప్పగించి కొట్టిస్తున్నట్లు తరుచు వార్తలు వస్తున్నాయి. ఇవి అన్నీ అబద్ధాలే నని ఏ మంత్రిగారైనా అంటే, ఆమంత్రి గారిమాటకి వాస్తవస్థితిగతులు తెలిపిన ప్రజలు విలువ ఇవ్వరు. అన్నిటిలో కొన్నైనా నిజం కాకపోవు. అంతే కాకుండా మన జిల్లాల్లో యం. యల్. ఏలు, కాంగ్రెస్ నాయకుల వ్యవహారాల్ని గమనించినట్లయితే ఈ వార్తలు అసత్యమైనవనడానికి నోరాడదు కాంగ్రెస్ లో కక్షలు స్పర్థలు మాసిపోయేవరకూ కమ్యూనిస్టుముప్పు తీరదంటే, అర్థం ఈ ముప్పు శాశ్వతమౌతుందనుకోవలసిందే కమ్యూనిస్టుల్ని అణిచివేస్తూన్నారనుకుంటున్న రాష్ట్రాల్లో కాంగ్రెస్ వాదులమధ్య కక్షలు ఇక్కడకంటే అధికంగా ఉన్నాయి కాబట్టి కమ్యూనిస్టుముప్పుని తూచడానికి కాంగ్రెస్ లో కక్షలు ముఖ్యకారణం కావు. అయితే కాంగ్రెస్ వాదుల మాటల్ని బట్టి పోలీసులు పనిచెయ్యడం మాత్రం మానవలసి ఉంటుంది. కక్షలు ప్రబలిఉన్నప్పుడు ఒక కక్షవారికి ఏఅవసరంకోసం కానివ్వండి పోలీసులు తోడ్పడుతున్నారంటే, ఆ కక్షవారు ఈ అవకాశాల్ని దుర్వినియోగపరుచుకోరనే గారంటీ బొత్తిగా ఉండదు కాబట్టి ప్రభుత్వం జాగ్రత్తవహించడం అవసరం. కృష్ణాజిల్లాలో కాకాని వెంకటరత్నంచిట్టిమొదలైనవారు ఎంత జాగ్రత్తగా నియమబద్ధంగా ప్రవర్తించేవారైనప్పటికీ, పోలీసు దళాలు వారు చెప్పిన ప్రకారం నడుచుకుని

(38-వ పేజీ చూడుడు)

# కా. నాగేశ్వరరావుగారు

19వ శతాబ్దము నడివయస్సు దాటి డెబ్బయ్యోపడిలో ఉంది. మన్నె దొరలు బందిపోటుగాళ్లు, చిన్నచిన్న స్వయంసర్దార్లు, వీళ్లపీడనుంచీ, కంపెనీ దొరల పీడనుంచీ, తప్పుకొని సీమరాణీచలవ వల్లే మంచిరాజ్యంలో బ్రతుకుతున్నామని జనులనుకొనే రోజులు.



"సురాజ్యం" మీదతప్ప "స్వరాజ్యం" మీద ఇంకా ప్రజలదృష్టి లేదు. అందుచేత ఏమాత్రం, విద్యావివేకమూ, వ్యక్తిత్వమూ, సుగుణాలూ, ఉన్నవారైనా, విదేశీయులదైనా, పరిపాలనాయంత్రాన్ని బాగుగా నడిపించటానికే దోహదం చేయచూచే రోజులు.

దేశంలో శాంతి ఉంది. సుభిక్షం మాత్రం అంతంతమాత్రంగానే ఉంది. సామాన్యప్రజకు నేటిమాదిరి కష్టదారిద్ర్యం లేదుగాని నేటికన్న అధికంగా ధనదారిద్ర్యం అనుభవించాల్సివచ్చేది. సాంప్రదాయబలంచేత సంసారాలు చితికిపోకుండా, నిలదొక్కుకొంటూ వచ్చేవి.

1867 సంవత్సరం, మే, ఒకటవతేది ప్రభవ సంవత్సర చైత్ర బహుళ ద్వాదశి. ఎలకుర్రు గ్రామంలో బుచ్చయ్య అయ్యవార్లంగారు సామాన్యగృహస్థు. అంటే పూర్వపు సాంప్రదాయాలు, అభిజాత్యాలు, దానధర్మాలతో ప్రతిష్ఠలుగా బ్రతకటాలు మిగిలాయిగాని సామెతలో చెప్పినట్టు ఇల్లు "అయ్యవార్లంగారి నట్టిల్లే." ఆనాటి రాత్రి ఆయనభార్య శ్యామలాంబగారు మగబిడ్డను ప్రసవించింది. ఆ యింటనే జ్యోతిషప్రజ్ఞగల పిచ్చివియ్యన్నగారనే ఆయన వీధిఅరుగుమీద కూర్చుని, చక్రం గుణించి, "మనకాశీనాథునివారి వంశంలో ఇంత కీర్తి ప్రతిష్ఠలకు రాబోయేవాడు ఇంతకుముందు పుట్టలేదు" అని జోస్యం చెప్పాడు. ఆబిడ్డడే నాగేశ్వరరావుగారు.

బుచ్చయ్యగారికి సాంబశివరావనే మరో కుమారుడూ, భ్రమరాంబ అనే కుమార్తె ఉన్నారు. (ఈ భ్రమరాంబగారి, కుమారుడైన శంభుప్రసాదుగారే నాగేశ్వరరావుగారి కుమార్తెను. వివాహమాడారు.)

నాగేశ్వరరావుగారి బాల్యం ఎలకుర్రులో, వీధిబడుల, చదువులో, తెలుగుసంస్కృతాలు, తూర్ణంగా అభ్యసించటంలో గడిచాయి. కాని తల్లి శ్యామలాంబగారు, కుమార్డు, ఆనాటి అంచనాల ప్రకారం హూణవిద్యావంతుడు అయితేనే కాని విద్యావంతుడు కాడని పట్టుబట్టింది. తండ్రికి హూణవిద్యపై అభిమానం లేదు.

(40-వ పేజీ చూడుడు)



ఎప్పుడో అరుదుగా తళుక్కున కనిపిస్తుంది:

# అడవి పువ్వు

కిందటి వేసవికి నే నాపూరు వెళ్లాను ఆ పరిసరాలంటే నాకత్యంత ప్రీతి. పచ్చని గుబుర్లు, తోపులు, చెల్లాచెదరుగా అడవిపువ్వుల మొక్కలు, తీగలు హృద్యంగా ఉంటాయి. అంతే కాదు. నిత్యం వృత్తిలో నిమగ్నమై ఉంటున్నప్పుడుకూడా ఆపరిసరాలు ఎప్పుడూ జ్ఞప్తికివస్తూనే ఉంటాయి

కొన్ని ఏళ్లక్రిందట నేను వైద్యవృత్తిని ప్రారంభించినది ఆవూళ్ళోనే. వృత్తినిర్వహణలో ఆవూళ్ళోని పేదల నివాసానికి తరుచు వెళ్లేవాడిని అక్కడే ఆమెను మొట్టమొదట చూశాను. ఆమెవయస్సు 14 ఏళ్లుంటుంది. ఆమె ఇంటికి ఫర్లాంగుదూరంలో ఉన్న బావినుంచి నీళ్ళతోడి తీసుకు వెడుతూ ఉండేది.

ఇంకా ఏడాదినిండని బిడ్డనెత్తుకునే చాకిరి చేసేది బిడ్డని మూపుపైన వేసుకుని ఉన్నిగుడ్డతో కంఠానికి పెనవేసుకునేది. ఆమెవెంట ముగ్గురుపిల్లలు అయిదు తొమ్మిదేళ్లమధ్యగలవాళ్లు ఉండేవారు. అందరి ముఖాల్లోనూ దాదాపు ఒకేపోలిక కనిపించేది.

ఆమె ఎంత దారిద్ర్యంలో గడపవలసి వచ్చినా, ముఖం నిత్యం హాసంతో తొణికిసలాడేది. అందువల్లనే నాకు ఆశ్చర్యమయేది.

ముందుగా ఆమెను చూసి మందహాసం చేసి పరిచయంచేసుకున్నాను. క్రమంగా చనువుచేసుకున్నాను. ఆమెఇంటిపరిస్థితులు తెలుసుకున్నాను. ఆమెతల్లి చనిపోయి అట్టేరోజులు కాలేదు తండ్రీ, పిల్లలూ ఒక చిన్నగుడిసెలో నివసిస్తున్నారు తండ్రి కూలిపనిచేస్తాడు కరకైనవాడు కాదు. మంచివాడు, ఎవరినీ పల్లెత్తుమాట అనడు. కాని మద్యానికి బానిసైనాడు.

కాబట్టి ఇల్లుసాకేభారం పెద్దకూతురుపైన పడింది. ఆమే వండాలి. ఆమే పిల్లలకి తినపెట్టాలి. తండ్రి తాగగా మిగిలిన డబ్బుల్తో వెచ్చాలు కొనాలి

పిల్లలందర్నీ ఆపేక్షతో చూస్తుంది కాని ఆఖరితమ్ముడంటే ఆమెకి ప్రాణం. అప్పుడప్పుడు తమ్ముళ్ళనీ చెల్లెళ్లనీ వెంటబెట్టుకుని బజారుకి వెళ్లేది. వాళ్లు అమ్మకోసం బెంగపెట్టుకోకుండా చూడ్డానికి అనేక ఉపాయాలు పన్నేది ఎప్పుడూ వాళ్లు నవ్వుతూఉండేలాగు కనిపెట్టేది. వాళ్లు కూడా ఆమె ఆదరణకు చక్కగా అలవాటుపడ్డారు వాళ్లకోసం ఏది చెయ్యవలసినా, ఎంత కష్టపడవలసినా జంకేది కాదు. ఆమెముఖంలోకి చూస్తే వాళ్ళకి ఆనందం వెల్లివిరిసేది.

జీవితంలో ఎదురయ్యే గొప్పల కెన్నడూ ఆమె తడబడలేదు ఈతిబాధలకు లొంగలేదు. చిరునవ్వుతో అన్నిటినీ సహించేది. సమాజంలోని ఝంఝూటాన్ని వీసమంతైనా లక్ష్యపెట్టకుండా బిడ్డలకు ఆనందం చేకూర్చడమే పరమావధిగా కాలాన్ని గాలిలో తేల్చివేసేది దారిద్ర్యంలోని ఎగుడుదిగుళ్లు, బాధలు సహజమైన ధైర్యంతో గ్రహించి, బాలికాసహజమైన అమాయకత్వంతో అన్నిటినీ సులువుగా అధిగమించేది.

క్రమంగా ఆమెపట్ల నాకు ఆదరం అధికమయింది. ఏదోవిధంగా సహాయం చెయ్యాలని నిశ్చయించుకున్నాను. పండుగనాడు ఆమెకూ, తమ్ముళ్ళకూ చెల్లెళ్ళకూ కొత్త బట్టలు కుట్టించి పంపాను ఆ కొత్తవస్త్రాలు ధరించినప్పుడు ఆమెను చూడాలని కోరక. ఆరోజున వెళ్లి చూశాను. మామూలుచినిగిన వస్త్రాలే ధరించిఉంది పిల్లలూ అంతే కొత్తబట్టలేవీ అని అడిగాను. ఆమె ముఖంలో దైన్యం, ప్రవేశించింది. జాలిగొలిపే ఆమెచూపులు క్షమార్పణ కోరుతున్నట్లున్నాయి "మీరా పంపినది. ఎవరో తెలియలేదు" అంది. కొంతసే పాగి సంకోచంతో చెప్పింది. "పండక్కి ఇంట్లో ఏమీ లేకపోయింది. రాముడు పరమాన్నం కావాలని ఏడ్చాడు కొత్తబట్టలు తాకట్టు పెట్టవలసివచ్చింది."

తెల్లబోయి చూశాను. పిల్లలకోసం, ఆమె ఏదైనాసరే త్యాగం చెయ్యగలదు. కాని ఆమె చాలా నీరసించిఉంది. పాలిపోయింది. మాతృసహజమైన ఈ ప్రేమ చిన్నపిల్లలో రాణింపుకు వచ్చింది. ఎలాగైనా ఆమె నుద్ధరించాలని నిశ్చయించుకున్నాను ఒకనాడు వద్దన్నా వినిపించుకోకుండా ఆమెను పరీక్ష చేశాను. ఆమె ఆరోగ్యం చాలా పాడయింది. ఆహారం చాలక కొంత చాకిరి అధికమై కొంత ఆమెలో క్షయలక్షణాలు బయలుదేరాయి.

సముద్రతీరాన ఒక గ్రామంలో నా బంధువు మిత్రుడు అయిన వైద్యుడొకడున్నాడు. అతనికి లేఖ వ్రాశాను అతను అంగీకరించాడు. ఒకనాడామెతో చెప్పాను. "నీ ఆరోగ్యం బొత్తిగా పాడయింది జాగ్రత్త పడకపోతే ప్రమాదం ఉంది నువ్వు జబ్బుపడితే బిడ్డల్ని ఎవరు చూస్తారు? అందువల్ల నువ్వు తప్పకుండా మందు తీసుకోవాలి. గాలికూడా మారాలి నా బంధువొకడున్నాడు. నిన్ను సంరక్షణ చెయ్యడాని కతను సిద్ధంగా ఉన్నాడు. నా మాట విని అక్కడికి వెళ్లు."

కాని వెళ్ళనని ఆమె ఖండితంగా చెప్పింది. మిగతాతమ్ముళ్లు చెల్లెళ్ళమాటెలా ఉన్నా ఇంకా మాటలైనా రాని ఆఖరుతమ్ముడి నెవరు చూస్తారు? ఏమైనా సరే ఆ తమ్ముడిని విడిచి ఎక్కడికీ పోనని చెప్పింది అయితే ఆ తమ్ముడిని వెంట తీసుకు వెళ్ళమని చెప్పాను వాళ్ళిద్దరికీ కాగల ఖర్చుల సంగతి ఆలోచించనవసరం లేదని చెప్పాను. మిగతా తమ్ముళ్ళనీ చెల్లెళ్లనీ సంరక్షించడానికి నేనే ఎవరినో ఏర్పాటు చేస్తానని చెప్పాను. చిట్టచివరికి అంగీకరించింది. అయితే ఆఖరుతమ్ముడిని కూడా

తీసుకువెళ్లింది. రైలెక్కినతరవాత తమ్ముడిని ఒళ్లో కూర్చోబెట్టుకుని దూరాన ఆవుల్నీ, పక్షుల్నీ చూపింది. సముద్రం తీరంచూసి ఉప్పొంగిపోయింది. తరవాత నేను తిరిగివచ్చేశాను.

తరుచు నా స్నేహితుడు ఉత్తరాలు రాస్తున్నాడు. ఆమెఆరోగ్యం క్రమంగా కుదుటబడుతోంది తమ్ముడు నడుస్తున్నాడు. వాడిని పెంచుకుంటానని ఎవరో ధనవంతులు అడిగారట. ఆమె మొదట అంగీకరించలేదు. ఆమెతండ్రికి విషయం తెలియగానే ఎగిరి గంతేశాడు. ఒకడికైనా దారిద్ర్యం తీరుతుందన్నాడు. వెంటనే పెంపుకివ్వమని చెప్తూ నా స్నేహితునికి ఉత్తరం రాయమన్నాడు. కాని ఆమెఅనుమతి లేకుండా అలా చెయ్యడానికి వీల్లేదన్నాను ఆరీతిగానే నా స్నేహితునికి రాశాను. తరవాత నా స్నేహితుడు ఆమెకు ఎంతో బోధించి చెప్పాడట. తమ్ముడు భాగ్యవంతుడౌతాడనీ, చదువుకోడానికి వీలుంటుందనీ చెప్పాడట చిట్టచివరికి ఆమె అంగీకరించింది. ఆమెఆరోగ్యం కూడా కొంత కోలుకున్నందువల్ల, పెంపు ఇవ్వగానే తిరిగి వచ్చేసింది. కాని ఆమె ముఖంలో అప్పుడప్పుడు బెంగచూపులు కనిపించేవి నిత్యమూ చిరునవ్వుతో వెలిగే ముఖంలో గాంభీర్యం గడ్డకట్టింది. మిగతా పిల్లలనీ తండ్రినీ మరింత శ్రద్ధతో సంరక్షణ చెయ్యడం ఆరంభించింది. అనునయంతోనూ ప్రేమతోనూ తండ్రిమద్య సేవనాన్ని కొంత తగ్గించింది. ఆమెను చూస్తే తండ్రికి శ్రద్ధ, ఆదరణ, కొంత నైతికంగా భీతి అలవడినాయి. ఆమె చెప్పినమాటను దాటేవాడు కాదు. ఇంట ఖర్చులు పొదుపుగాచేసి కొంత డబ్బు నిలవచేసి తాకట్లు తీర్చింది పూరిగుడిసెను పరిశుభ్రంగా ఉంచేది.

ఒకనాడామె ఇంటికి వెళ్లినప్పుడు గడప వద్ద కూర్చుని ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది దగ్గరకు వెళ్లి ఆదరంతో ఎందుకని అడిగాను. తమ్ముడి పెంపుడు తండ్రివద్దనుంచి ఉత్తరం వచ్చి వారం పైనయిందట. ఆమెను బుజ్జగించారు. తమ్ముడు అక్కడ సుఖపడతాడనీ, అక్కడుంటేనే వృద్ధిలోకి వస్తాడనీ చెప్పారు తరవాత నాస్నేహితునికి ఉత్తరం రాశాను వారంరోజులికి సమాధానం వచ్చింది ఆమెతమ్ముడికి జ్వరం వస్తోందిట పెంపుడు తల్లిదండ్రులు ఖర్చుకి వెనదియ్యకుండా వైద్యం చేయిస్తున్నారు. క్షయరోగమని అనుమానంగా ఉన్నట్లు రాశాడు.

ఆమెలో ఈవిషయం చెప్పడం నాకు గగనమయింది. నోరాడలేదు. కాని చెప్పక తప్పదు. చెప్పినతరవాత ఆమెదుఃఖం కట్టలు తెగివచ్చింది ఆమెబాధ చూడలేకపోయాను ఆమెను పట్టశక్యం కాలేదు ఆమె ముఖంలోని ఆచురుకు, చిరునవ్వు మాయమైపోయాయి. ముఖం నల్లబడిపోయింది. ఉన్నపట్టున క్షయవ్యాధి ఆమెను ఆవహించినట్లు కనిపించింది. చివరికామెను వెంటబెట్టుకుని ఆవూరు వెళ్లాను. అక్కడామె నిద్రాహారాలు మాని తమ్ముడికి ఉపచారం చేసింది తమ్ముని చూడగానే తిరిగి ఆమె ముఖంలోని నవ్వువచ్చింది. అలా నవ్వుతూనే ఒక మాసం సేవచేసింది ఆమెను చూసిన తమ్ముడికి వ్యాధి వెనకపట్టింది. ఆమెఆరోగ్యం పూర్తిగా పాడయింది. ఒక మాసంలో తమ్ముడు కోలుకున్నాడు. ఆమె కుమాత్రం వ్యాధి ప్రబలమయింది. తన ఇంటికి తిరిగివచ్చిన మాసంరోజులికి ఆమె వ్యాధికి బలి అయింది

ఇది జరిగి కొన్నేళ్లయింది. తర్వాత నేను చాలావూళ్లలో వృత్తికోసం బదిలీఅయ్యాను. కాని సెలవు లభించినప్పుడెప్పుడో ఆవూరు వెడుతూవుంటాను. చిన్నతమ్ముని ముద్దుముఖం చూస్తూ, చిరునవ్వుతో దుర్భర దారిద్ర్యాన్ని సులువుగా జయించగలిగిన ఆ అడవిపువ్వు నా మనోవీథిలో నిత్యం పొడగట్టుతూనే ఉంటుంది.

[క్రానిన్ రచన ఆధారం]



ఈస్టరన్ షిప్పింగ్ కార్పొరేషన్ నిర్మాణ విషయంలో సింధియా స్టీమ్ నావిగేషన్ కంపెనీవారికీ భారతప్రభుత్వానికీ మధ్య జరిగిన ఒడంబడికమీద వాణిజ్యశాఖా కార్యదర్శి సి. సి. దేశాయిగారు చేవ్రాలు చేస్తున్న దృశ్యం.

# ఆదికవి–ఆదికావ్యం

జోలపాటలలోనూ, స్త్రీల సువ్విపాటలలోనూ కూడా కనబడే గేయభాగం తెలుగునాట ప్రతీవారికి తెలుసును

"ఉత్తముని పేరేమి ఊరి పేరేమి
సత్యపురుషుల కన్న సాధ్వి పేరేమి
ఉత్తముడు రాముండు, ఊరు అయోధ్య
సత్యపురుషుని గన్న సాధ్వి కౌసల్య"

పాపని జోకొట్టుతూన్నప్పుడూ, పని పాటల్లో అలుపుతీర్చుకొనేటప్పుడూ కూడ, త్రిలోకాలకూ, త్రికాలాలకూ ఉత్తముని పేరేది అని అడిగితే తెలుగుతల్లి "రాముని" పేరు చెప్తుంది. లీలాశుకుడుకూడా కృష్ణుణ్ణి నిద్రపుచ్చేందుకు యశోదకథ చెప్పాల్సి వచ్చిన ఘట్టంలో "రామోనామ బభూవ" అంటూనే రామకథ ప్రారంభించి, ఆ అవతారాల సమేకభావం చూపించే రమ్యమైన ఊహాగానంతో ఆ శ్లోకాన్ని రత్నపు తునకగా చేసివైచాడు.

రాముడనే రాజు ఉన్నాడో లేదో కాదు ముఖ్యం. లౌక్యపరిజ్ఞానంప్రకారం చూసుకొంటే, కేవలం వాల్మీకి చెప్పిన లాంటివాడు కాకపోయినా, లేక భారత ప్రజలు ఈనాడు భావించుకొనేటటువంటి వాడు కాకపోయినా, ఒకరాజు ఉండి ఉండాలని, అతనికి జయంత్యుత్సవంగా, వత్సరకాలమానంలో నిలిచిన పండుగనుబట్టి అనుకోటం సబబేమో అనిపిస్తుంది. మనకు అట్లా పురాణపురుషజ్ఞాపకార్థంగా ఉన్నవి భారతావనికంతకూ ప్రశస్తంగా తెలిసినవి మూడు పండుగదినాలు కనబడుతాయి శ్రీరామనవమి, శ్రీకృష్ణాష్టమి, భీష్మఏకాదశులు మూడూ. వినాయకచవితి, దుర్గాష్టమి, శివరాత్రి, మూడూ మానవులుగా వ్యవహరించని దేవతాస్వరూపాలను గురించిన పండుగలుగానే భావించబడుతున్నాయికాబట్టి, యథార్థవ్యక్తుల స్మరణకే శ్రీరామనవమి, శ్రీకృష్ణాష్టమి, నిలచాయంటానికి, పూర్వపక్షవాదాలుగా తయారవవు. ఇంతకూ రాముడు ఉన్నా ఉండకపోయినా, వాల్మీకి సృష్టించిన రాముడు, ఆ కథ జనశ్రుతంగా నిగ్గుతేలి వ్యక్తిత్వము మిగిలిన రాముడు, భారతీయహృదయానికి యథార్థవ్యక్తిగానే గోచరిస్తాడు.

ఆకవి ఆదికవి. ఆ కావ్యము, ఆదికావ్యము. ప్రపంచానికంతకూ ఆదికావ్యమౌనో కాదో మనం వివరించటం ఎందుకు? ప్రపంచంలో రామకథ తెలిసినంతగా మరో పురాణకథ తెలిసిన అధికజనసంఖ్య లేదు. కేవలం సంఖ్యాబలమే కాదు. ఇంతకాలంగా, రామకథ జనహృదయంలో బలీయంగా నిలిచినంతగాఢంగా (ఈనాటికి లెక్కచూసుకొంటేనే, భవిష్యం లెక్కపెట్టుకోకుండానే) నిలిచిన మరోకథ ఏదీకంది, ఏదీ కూడా కనబడదు. పోనీ కథలో మానవాతీతాంశాలు ఏమైనావున్నాయా అంటే, ప్రతిదేశపురాణకథలోనూ ఉన్న రాక్షస విజయాలను మించి మానవాతీతంగా కనబడే అంశమేదీ కథలో బిగించుకో లేదు.

రామాయణంలో, యుగయుగాలుగా మానవనిత్యజీవితంలో గాఢమైన నిరంతరాయమునకు సన్నివేశం మానవసంఘ పురోగమనధర్మానికి నిత్యప్రతిబంధకమైన సాంఘికసహజ విపర్యాసము, కథామూలకమైన వస్తువు.

సంఘానికి మూలం స్థిరమైన గార్హస్థ్య జీవనం. ఈ గృహస్థితికి, సంఘంలోని పరవ్యక్తులవల్ల ఘాతం తగులకుండా ఉండటానికే, ముఖ్యంగా సంఘం ఎన్నిచట్టాలూ రాజ్యాలూ నిర్మించుకొన్నా ఈ ఘాతం కల్గించేందుకు, పరకీయకామనం ప్రబలదుష్టశక్తిగానే మానవస్వభావంలో ఇమిడిఉంది.

ఆ శక్తిని జయించేందుకు, సాంఘిక వ్యక్తికి మూలాధారమైన ఏకపత్నీవ్రతనిష్ఠను పాలించిన మహామహుడు 'రాముడు' కథానాయకుడు. ఇంత ప్రాథమికమైన విషయం భార్యాపహరణము, కథావస్తువుగా గల పురాణకథలు, గ్రీక్ కథలలో హెలెన్ కథలాంటివితప్ప ఎక్కువ కనబడవు. ఆ కథలోకూడా, రామాయణంలో ఉన్న సాంఘికధర్మవిశిష్టత లేదు. సీత అన్యాసక్త కాదు. పతివ్రత. సంఘంవిచ్ఛిత్తికి ఆమె దోహదమెంతమాత్రమూ లేదు. హెలెన్‌కు భర్తృనిష్ఠలేదు. అక్కడ సంఘపురోగమనమున కపకారమేదో దానికి హెలెనే మూలకారకము. తన్ను ప్రేమించి వెంటబడ్డ స్త్రీనే తెచ్చుకోటంలో, పారిస్ కేవలము సంఘవిచ్ఛిత్తికి దోహదమొనరించినా తప్ప రావణునంతగా మానవస్వభావంలోని ఒక తీవ్రఅవగుణానికి ప్రాతినిధ్యవ్యక్తిగా సంఘవిచ్ఛిత్తికి మూలకారకుడుగా నిలువలేదు.

రామాయణకథ ప్రతిపామరుడూ కూడ మూడు ముక్కలలో చెప్పకొనే కథే. "రాముడనే రాజుండేవాడు. అతను పిత్రాజ్ఞను పాలించటానికై భార్య సీతతోనూ, తమ్ముడు లక్ష్మణుడుతోనూ, వనవాసానికి వెళ్లాడు పంచవటిలో ఉండగా లంకపురాజైన రావణుడనేవాడు రహస్యంగా సీతను ఎత్తుకొనిపోయి లంకలో దాచాడు. రాముడు సముద్రందాటి రావణునీ రావణునిబలాన్నంతనూ, జయించి సీతను ఇంటికి తెచ్చుకొన్నాడు." దీనికే "కట్టె, కొట్టె, తెచ్చె" అన్న మూడు ముక్కలూ, రామకథకంతకూ సంకేతాలుగా జనంలో నిలిచిపోయాయి.

ఈ మూలాధారంపై, కథలోని ప్రతివ్యక్తినీ ప్రత్యేక ప్రతిభాశాలిగా సృష్టించి సర్వపురాణవ్యక్తులకన్నా మిన్నలుగా చూపించి, భారతీయహృదయానికి మధురాతిమధురమైన రసస్పృష్టి చేశాడు వాల్మీకి మహర్షి.

రాముడు దేవతాంశుడుగా ప్రజలలో నమ్మకం గాఢంగా కల్పించాడు. కాని ఆ రాముని జీవితకథలో, సామాన్యజీవితంలోని ఉత్తమమానవుని స్వరూపమే, సామాన్యమానవుని సుఖదుఃఖాలనుభవిస్తూ మన గుండెలను ద్రవింపచేసిన కష్టజీవిగాథే ఎన్నియుగాలకైనా మానవజీవితంలో సన్ని

(39-వ పేజీ చూడుడు)

# 'నవభారతంలో కళాభివృద్ధి'

శ్రీ వేలూరి రాధాకృష్ణ

రిపబ్లిక్ అవతరణతో, భారతదేశానికి నిజమైన స్వాతంత్ర్యం ఇప్పుడు లభించింది ప్రజలు, దాదాపు రెండుశతాబ్దాలు బానిసత్వపు సంకెళ్ళలో, మానసికంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా, కడుదుర్బలులై పోయారు ఇప్పుడిప్పుడు, ఆ దుర్బలత్వాన్ని వీడి స్వేచ్ఛావాయువును పీల్చుకుని, అన్ని విధాలుగా పుంజుకుంటున్నారు మన జాతీయ ప్రభుత్వ కూడా, ఆర్థిక, విజ్ఞానసౌభాగ్య దాయకములైన, అనేక కార్యకలాపాలని కొనసాగించటంలో, మునిగివుంది.

మానవుని దైనందినజీవితంలో ఆహారపానాదు లెంత అవసరమో, విజ్ఞానం కూడా అంత అవసరం కళకూడా విజ్ఞానసంపదల్లో ఒకటి కాబట్టి, అదికూడా దైనందినకార్యక్రమంలో ఒక ముఖ్యావసరం. దీనిని పెంపొందించేనిమిత్తం, మన జాతీయప్రభుత్వం సత్వరమైన చర్య తీసికోవాలని, మాలాంటి కళాకారులు హెచ్చరించటం అప్రస్తుతం కాదని అనుకుంటాను.

ప్రపంచంలోని అన్ని ఇతరదేశాలూ, దాదాపు అనాగరికస్థితిలో నుండగా మన భారతదేశం, సర్వతోముఖాభివృద్ధిని పొంది, ముఖ్యంగా కళవిషయంలోనూ, సారస్వతవిషయంలోనూ, అద్వితీయమైన నాగరికతతో ప్రవర్ధిల్లిందని చెప్పటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు. మతం, విజ్ఞానం, ఆశియాలోని తదితరదేశాలైన చైనా, జపాన్, ఇండోనేషియా, కాంబోడియా మొదలైనవాటిలోనికి, మన భారతదేశంనుంచి ప్రచారంచేయబడినవన్న సత్యం అందరికీ తెలిసినదే కాలక్రమంగా, భారతదేశంనుంచి, బౌద్ధమతస్థులు, ఇతరదేశాలలో తమ ఆశయబీజాలని నాటాలన్న దానికి, కళారూపకంగా ఇప్పటికే ఆయాదేశాలలో తార్కాణాలు కనిపిస్తూనే ఉన్నయ్. ఆ మతోద్దేశ్యమైన కళాఖండాలు, ప్రపంచయాత్రికులను ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ ముగ్ధుల్ని చేసినయ్ చేస్తునయ్. అజంతా ఎల్లోరా, బాగ్ కళానిలయాలు అద్వితీయమై, అసమానమై నిలచి, కళాసాంప్రదాయానికి భారతదేశం ఆదర్శప్రాయమై ప్రపంచముఖాన సగర్వంగా నిలుచున్నది!!!

సరే; కళాసాంప్రదాయం, కళావైభవం, అత్యున్నతస్థితికి వెళ్లినసంగతికి మనం అంతా గర్వపడవలసినప్పటికీ, కేవలం గతచరిత్రనే స్మరించుకుంటూ, అచేతనంగా ఉండటం తగిన పని కాదుకదా! కాలానుగతంగా, మనం ఆ కళాసాంప్రదాయానికి, సరియైన రీతిన, దోహదంచేసి, కార్యశూరులం కావటం కర్తవ్యం అలా కళా, విజ్ఞానసేవ, చేస్తున్నప్పుడే, మన పూర్వనాగరికవైభవానికి సరియైన వారసులం కాగలం.

విద్యావంతులూ, విజ్ఞానధనులూ, మన 'జాతీయ' కళావిజ్ఞానాభివృద్ధికి ధైర్యంతో నడుంకట్టి, వారివారి మేధాశక్తులను, నూతన పథంలో నడపాలి విజాతీయపరిపాలన జగజ్జేగీయంగా, దాదాపు నూటయాభై సంవత్సరాలు మన దేశంలో నడచుటవల్ల, వారి ఆజ్ఞానుబద్ధులం అయి స్వతంత్రమైన పోకడను కోల్పోయి, వారి చేతులలో కీలుబొమ్మలమయిపోయి, జాతీయకళాఖండాలఘనతను చూడ్డానికి కళ్లు లేక, అర్థంచేసుకోడానికి మనస్సు లేక, రసహానులమై కేవలం కబోదులం, బధిరులం అయిపోయాం మన జాతీయ జీవనాన్ని జ్ఞానాన్ని పోగొట్టినందువల్ల వారి పరిపాలనలో పొందిన విద్యావ్యాసంగం కేవలం నిరుపయోగమే. స్వత్వాన్ని పోగొట్టే, ఏ విద్య అయినాసరే ఒట్టి నిష్ప్రయోజనం, అది ఇతరత్రా ఎంత ఘనత వహించినాసరే. అలాటి బూటకపు విజ్ఞానప్రదానంవల్ల, మన కసలు, సరియైన దృష్టి అనేది శూన్యమైంది. విజాతీయమైన కళాజ్ఞానాల్లో మనం ఎంత పండితు మైనాసరే, స్వకీయమైన విజ్ఞానాన్ని కోల్పోయినప్పుడు, కేవలం మన మానత్వాన్ని కోల్పోయామన్నమాట.

ఇన్ని అవరోధాలు, స్వదేశంలో, పాశ్చాత్యులు మనకు కలిగించినప్పటికీ, గతనల్గై సంవత్సరాలనుంచి, మన చిత్రకారులు, శిల్పులూ, వారికి చేతనైనంతా, శక్తిమించిన కృషిని కూడా చేసి ఇప్పటి యు చిత్రకారులకి 'జాతీయమైన' కళ ఇదే అ నిరూపించి మార్గదర్శకు లయ్యారు. అయినప్పటికీ, ప్రాచ్యభావనాశక్తికి, పాశ్చాత్య దృష్టి ఇంకా పోలేదు. దాని విపరీతచర్యలే మన చింతనానుభూతిమార్గంలో అవరోధాలై విభిన్న జాతీయజ్ఞానాన్ని కలుగ స్తున్నయ్. అయినా నవభారతకళలో [illegible] పోకడలవల్ల నిజంగా మనం అన్నివిధాలా సర తోముఖంగా అభివృద్ధి చెందగలమనే ఆ కలుగుతోంది. కళావిద్యార్థుల్లో ఈ పాశ్చాత చింతనా, అభ్యాసదృష్టిపోయిందని తే సుకున్నతరువాతగాని, మన పూర్వకళ సాంప్రదాయాన్ని పోషించి, వృద్ధిపొం తున్నట్లు ఇంకా సంతోషించలేం విద్యార్థిదశలోని, కళా, విద్యా జాతీయంగా అభివృద్ధిపొందాలి. దీ కోసం, జాతీయమైన పద్ధతులలో, ఆదరా లలో, విద్యార్థులు కళాభ్యాసం చేయాలంటే మన దేశంలోని, కళాలయాలలో కొత్తవిదా విధానం ఏర్పాటుచేయాలి ఎందుకంటే మన కళాజ్యోతిని, అఖండజ్యోతిగా చేసే ఇప్పటి కళావిద్యార్థులు! వారు పాశ్చాత దృష్టి పూర్తిగా మరిచిపోవాలి. జాతీం మైన విధానంలో కళాభ్యాసం చేయా అల్లా చేస్తే, దేశంయొక్క విశిష్టత, బా ద్యోతకం అవుతుంది.

కేవలం కళాశైలిని ఏర్పడుచుకున్నం వల్ల కూడా లాభం లేదు. సర్వతోముఖం

అభివృద్ధిచెందాలంటే, మన దేశ చరిత్రనీ, మనుష్యశాస్త్రాన్నీ మన మతాన్నీ పూర్తిగా, అవగాహన చేసికొని, విద్యార్థులకు కళాబోధ చేయాలి. మన జాతీయ జీవనంలోని ప్రధానాంశాలని వారి కరం అయేటట్లు చేసి, సరియైన మార్గాన పెట్టాలి. ఆవిధంగా చేసినట్లైతే, వారు కళ నేవిధంగా పోషించిఅభివృద్ధిచేయగలరో వారికే తెలుస్తుంది.

ఇంతవరకూ పాశ్చాత్యకళావిధానాన్ని ఖండించటంమూలాన, పూర్తిగా పాశ్చాత్య కళని అసహ్యించుకొని, దానిని వెలివేస్తున్నట్లు అర్థం కాదు. ఆవిధంగా శత్రుత్వాన్ని తెచ్చుకున్నట్లు అర్థం చేసుకో కూడదు. పాశ్చాత్యకళలోని ప్రత్యేకత నిలబడాలంటే దానిని మనం అనుకరించకుండా ఉండటమే. దానివల్ల మన ప్రత్యేకతకు కూడా స్థానం ఏర్పడుతుంది. కళలో అసలు విభిన్నత్వమే కూడదు. విభిన్నత్వం నాశనానికి దోవ తీస్తుంది. ఉదాత్తమైన కళ ఎప్పుడు ఏవిధంగానైనా సృష్టింపబడనీ, కేవలము భావనా సందేశాన్నే కాక, కాలమానాంతులని రూపు మాపి, శాశ్వతానందాన్ని కలుగజేస్తుంది. ప్రపంచంతో సంబంధం లేకుండా, ఏ దేశమూ ఏకాకిగా బ్రతకలేదు. దానికుండవలసిన సంబంధాన్ని ఉంచుకుంటూ దాని ప్రత్యేకతని అది చూపుకోవాలి. కాని అనుకరణవిధానం కేవలం నీచం హేయ్యం కూడా. అది కళకు మృత్యువువంటిది...అది, కేవలం సృష్టికే గొడ్డలిపెట్టు!!

భారతదేశంయొక్క విశిష్టత శతాబ్దాలుగా బానిసవృత్తిచే, రూపు మాసిపోయింది. ఆవిధంగానే నాగరికతకూడా వినాశమైంది. ఆనాగరికతయొక్క జాడలు మనకు వెళ్లినచో ఎల్లా కనపడుతూఉన్నయ్. ఆ జాడలసహాయంతో, మనం మన పూర్వసౌధాన్ని పునః ప్రతిష్ఠచేసుకోవాలి. అందువల్ల, విజాతీయమైన జ్ఞానాన్ని మనం పూర్తిగా మరిచిపోవాలి. మన విద్యార్థులకు ఆ గాలి సోకకుండా చేయాలి. అప్పుడు వారిని సంపూర్ణకళాకారులుగా తయారు చేయాలి. ఆవిధంగా తయారుచేసినతరువాత, వివిధదేశకళావిజ్ఞానవిధానాలను సంపూర్ణ జ్ఞానదృష్టిని అలవరచడంకోసం తెలియజేయాలి.

కళాకారులు ప్రతిభావంతులు, స్వేచ్ఛావిహంగాలు. ఆ విహంగాల రెక్కలను తెంచివేయాలని ఎవ రెంత ప్రయత్నం చేసినా, అది అందని పళ్లకి అఱ్ఱులు చాచటమే అవుతుంది. కొద్దిలో విశ్వాన్ని భావించటం, అశాశ్వతంలో శాశ్వతత్వాన్ని భావించటం, కళకు సహాయకారి కాదు. అందువల్ల మోక్షసాధనమూ కాదు. మన కళ భారతీయకళ

(30-వ పేజీ చూడుడు)



భారత రిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ గారు యీ నెల 15 వ ప్రభుత్వ భవనంలో ఇండియా పోలోసంఘం వారికి అర్జెంటైనాపోలోజట్టుకు విందొసగినప్పుడు తీయబడిన చిత్రం. చిత్రంలో ఇండియా పోలోజట్టు కాప్టెన్ జయపూర్ మహారాజా (మొదటి వరుసలో ఎడమనుండి మూడవవారు), అర్జెంటైనా జట్టుకాప్టెన్ జోస్‌జవలాటా (రాజేంద్రప్రసాద్ గారికి ఎడమప్రక్క నున్నవారు) ఉన్నారు.

నవల:



## శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౨౪

ఆనుకొననివిఘ్నముగా నిది యంతయు జరిగిపోయినది మారయాలోచించి గాని యే పనియు జేయ దొరకొనని యంబదేవునికి ఆనాడు జరిగినది చూడగా నద్భుత మయ్యెను. శ్రీరుద్రదేవమహారాజులకు దక్షిణభుజ మీతడని లోకు లెల్ల దన్ను కీర్తించుచుండిరి తనతో నా గౌరవము పంచుకొనుట కిప్పుడు అన్నమంత్రీశ్వరుడు గౌరవస్థానమున నైన లేడు అట్టి తాను గూడ ఈనాడు ఈశ్వరేచ్ఛకు బద్ధుడై సూత్రధారునిచేతిలోని తోలుబొమ్మవలెనే ఆడవలసి వచ్చినదిగదా! తలచుకొన్నకొలది అతనికే విభ్రమము కలుగసాగినది ఈవిచిత్రసంఘటనచే నా ప్రదేశమున కోటకును అగడ్తకును అంతరాయము రాకుండ విరిసిపోయినది ఈశ్వరకృప యుండవలెను గదా! పాప మన్నమంత్రీశ్వరుడు ఈశ్వరకృప యున్నచో నీ స్థితిలో నుండునా? అంబదేవుడును అన్నమంత్రియు కొంచె మెచ్చుతగ్గుగా ఒకయీడువారే వారిరువురు మిత్రులే ఐనను అంబదేవునకు రాజాదరమున దన కిప్పుడు ప్రత్యర్థి లేకుండుటకు అంతరాంతరములలో సంతోషము లేకపోలేదు!

వసతిపక్షమున వ్యవహరించుచున్నవారు మొదటినుండియు నిక్కడ యగడ్త త్రవ్వకుండ జేయుటకు చేసిన ప్రయత్న మాతని హృదయమున నొక గట్టి పట్టుదల కలిగించెను. 'మర్యాదగా నెన్ని విధముల జెప్పినను మాట వినక నిర్లక్ష్యము చేసిరే వీరు! వీరి నెట్లైనను సాధించి తీరవలెను!'

ఇట్లని నిశ్చయించి యా మరునాడే ఆ వసదికి సంబంధించిన పత్రములును శాసనాదులును స్వయముగా పరిశీలించి దగ్గరనుండి కొలతలు వేయించెను అట్లు సరి చూడగా తుదకు ఇన్నాళ్లును వసదిలోని భాగముగా పరిగణింపబడుచున్న ప్రదేశములో నాలుగవవంతు వసతి కెన్నడు నీయబడియుండలేదని ధ్రువపడెను కరణములు వారి కనుకూలు రైనందున నది బయట పెట్టకుండ కప్పిపెట్టి యుండిరి అట్లు అనధికారముగా నాక్రమించిన ప్రదేశమున జైనసాధువులకు తపస్సు కనువుగా గృహశాలలుకూడ నిర్మింపబడి యుండెను అంబదేవుని కీ విషయము నిర్ధారణ మైన వెంటనే యాత డాయా ప్రదేశముల వర్ణించి యవి వెంటనే అప్పగింపవలె నని రాజాజ్ఞ యావసతియధికారుల కందజేసెను

దానితో నా వసదిలో పెత్తనదారులకు కలవర ముదయించెను. నేమినాథుని విగ్రహమునకైన యగౌరవమును కన్నులార తిలకించిన పిమ్మట మొండితనము ఇక సాగదని వారు నిశ్చయించిరి. అంబదేవునితో విరోధము పెట్టుకొని మనగలమా యను భయము వారి నావేశించెను అప్పటి వ్యవహారికు లాలోచించి నాగాచారిని పిలిపించి సర్వమాతనికి నివేదింప నిశ్చయించి యాతనికి రమ్మని వార్త నంపిరి

నాగాచారి వచ్చి పత్రము లన్నియు వివరముగా పరీక్షించెను వసతి కట్టుకొనుటకు ప్రాచీనప్రభువు లిచ్చిన శాసనములు అందులో వసది కిచ్చిన ఎల్లలు సీమలు మరల మరల పరిమాచెను మిగిలిన గుర్తులు చాలవర కిప్పుడు మరిపోయి యుండుటచే గుర్తింప సాధ్యపడకున్నవి మరికొన్ని ఇవి కావు అవి యనియు అవికావివి యనియు వాదించుటకు వీలుగా నున్నవి కాని యా రాతిగుట్ట సరహద్దు కాదనుట ఎట్లు? అది మాత్రము సాధ్యము కాదు! గుట్ట మారిపోయిన దనవలెను కాని అది ఎవ్వరు నమ్ముదురు? పైగా వానిలో నుదహరించిన ఎనిమిది దిక్కులలో మూడుదిశల నాగుట్టయే సీమగా ఉన్నది ఆ దానములో నాగుట్ట యిమిడి యుండ లేదని శాసనములో స్పష్టమగు వాక్కులున్నవి అందుచే నా శాసనాధారములపై వ్యవహరించుట సాధ్యముకాని పని వ్యవహారజ్ఞులతో నాలోచింపక ఆ నేమినాథవిగ్రహమును రహస్యముగా నొకచోట పెట్టుట, ఆ పెట్టిన భూఖండము తమకు దాన మీయబడినదని ముందు మొండిగా వాదించుట, అధికారులను ధిక్కరించుట వీనివలన నేమినాథవిగ్రహ మచ్చట తామే నిశీథమున ప్రతిష్ఠించితి మను సందేహము ధ్రువపరచుట—ఈకర్మకాండ మంతయు నా వసదివ్యవవర్తల మూర్ఖతను స్పష్టపరచుచున్నది అందును ఆవల ఇంకొకరు ఇంకొకరు కాదే! అది అంబదేవుడే! ఆతని కుశాగ్రబుద్ధిని వ్యవహారదక్షతను కార్యదీక్షను ఎదుర్కొవలసి వచ్చినది! ముందే ఆతనితో మర్యాదగా 'మాక్రింద నిది చాలకాలముగా నున్నది మీదయ వచ్చినట్లు చేయుడు' అని విన్నవించుకొన్నచో కార్య మింత మించెడిది కాదు ఆతడు ఎదిరించినవారిపై మిక్కిలి పట్టుదలతో వ్యవహరించును. కార్యరంగమున ప్రవేశించినయెడల ఎట్టి పొరసందును రానీయక నవరంధ్రములు బిగించివేయును నాగాచారి వివరించువరకు అంబదేవుని యాజ్ఞలలోని ఇతరసూక్ష్మవిషయములు ఆ వసది వ్యవహర్తలకు దెలియను గూడ తెలియలేదు ఈ యాజ్ఞలు నిర్వర్తింపబడిన వసతిలో చాలభూభాగము పోవుటే కాదు, అందులోని

సుందిరములు పోవుటే కాదు; ముందు యీ వసతికి బయటినుండి రాక పోకలు గూడ స్తంభించి పోవును అందుపై వసతిలోని సాధువులు వసతియే వదలిపోయి వేరొక నివాసము చూచుకొనవలసిన పరిస్థితు లేర్పడును

నాగాచారి యట్లు వివరించినంతనే ఆ వసదివ్యవహర్తలు ముందు నమ్మలేకపోయిరి అతడు చెప్పినది నిజమే యని వారి కర్థమైన మీదట కోపము ఒక్కసారిగా ముంచెత్తుకొని వచ్చినది కాని ఏమి చేయగలరు ? ఎంత కష్టపడి వ్యయపడి తరతరములుగా నిర్మించుకొనివచ్చిన యీ భవనములు విశ్రాంతిశాలలు ధర్మసత్రములు విడిచి పోవలసినదేనా ? 'అంబదేవుని శాంతింపజేయు మార్గము లేదా ?'

నాగాచారి "అది మన మొదటి బిగువుతోడనే బిగిసికొని పోయినది లాభము లేదు !"

ఆ మాటలతో వారికి అధైర్యమే ఆవేశించినది 'మరి యిప్పుడు చేయ దగిన దేమి ?'

అదియే నాగాచారి సుదీర్ఘముగా నాలోచించెను కొంత వడికి నిశ్చయించి వసదికరణమును బిలిపించి శ్రీరుద్రదేవమహారాజులకు జినవసది కర్తృత్వులగు సిద్ధనందులవారు పంపుకొను విజ్ఞాపనపత్రమును లిఖింప నాజ్ఞాపించి తో నాతనికి అందుండవలసిన విషయములు చెప్ప నారంభించెను

ఆ పత్రములో ముందు శ్రీరుద్రదేవమహారాజులయు వారి పూర్వులయు నిష్పక్షపాతబుద్ధియు ధర్మనిరతియు నుగ్గడించి ఈ వసతి సాధువులు ప్రభువుల యైశ్వర్యాభివృద్ధులకై అనాదిగా చేయుచున్న తపస్సును వర్ణించెను

అంతట వ్యవహారసందర్భములు వివరింప ప్రారంభించెను. ఆ వసదిపై కాకతీయవంశప్రభువులకు ఉండుచు వచ్చిన భక్తిశ్రద్ధలచే వా రెన్నియో దానములు చేసియుండిరి అందులో చాలవరకు సాక్ష్యముగా చూపుటకు ప్రభువుల శాసనములును పత్రములును ఉన్నవి కాని కొన్ని ప్రదేశములు ప్రభువు లాతావునకు వచ్చి కన్నులతో చూపి నిర్దేశించి యిచ్చినవే కాని లిఖిత మగు నాధారములు అట్టివానికి లేవు ప్రభువులు స్వయముగా వాగ్రూపముగా దాన మొనర్చిన ప్రదేశము కు లిఖితప్రమాణ మిండని యర్థించుట వారి కపచారము చేయుటకదా ! అట్టి ప్రదేశములు వసదియనుభవములో చిరకాలముగా నుండుటే గాని అందు కాధారముగా లిఖితశాసనములు లేవు.

అట్లు వసదికి దానమీయబడి లిఖితాధారము లేని యొకానొక ప్రదేశమున చిరకాలముక్రిందట మా పూర్వాధ్యక్షులు నేమినాథవిగ్రహము ప్రతిష్ఠింపదలచి యొక పాదు చేసి అందు రత్నములు సువర్ణములు నిక్షేపించి దానిపై చిహ్నముగా నొక స్ఫాటికశిల స్థాపించియుండిరి అందుకు విగ్రహముకూడ నెన్నడో సిద్ధమయ్యెను కాని ఇతరములగు చిక్కులచే నా ప్రతిష్ట యప్పటిలో నాగిపోయినది

సరిగా నా స్థలమే ఇప్పుడు ప్రభువులు నిర్మించుచున్న శిలాప్రాకారము నగడ్తలోనికి కావలసివచ్చినదట ఆ పవిత్రప్రదేశము మాత్రము ఆ యగడ్త మధ్యముననే ఉండనిచ్చునట్లు విన్నవించుకొనిన సరిపోయెడిది మే మప్పుడు మౌనదీక్షలో నుంటిమి ఆ సమయమున విషయపరిజ్ఞానము లేని యితరులు తొందరపడి మూర్ఖించి యీ స్థలము రాజపురుషుల కప్పగించుటకు నిరాకరించి యచ్చట పూర్వము మేము ప్రతిష్ఠింపదలచిన నేమినాథమూర్తిని అర్ధరాత్రమున ప్రతిష్ఠించినారు. అందుపై రాజపురుషు లాగ్రహించి బలవంతముగా నా పవిత్రమూర్తిని తొలగించి యా ప్రదేశము త్రవ్వించిరి అంతలో ఆ పనికై నియోగింపబడిన జినద్వేషులు మూర్తిక్రింద నున్న స్ఫాటికశిలను లింగమూర్తి యని యాఘోషించి దానిని దానితోపాటు అందుక్రింద స్థాపితమైన మా రత్నసువర్ణరాసులను ఎత్తించుకొని వేరుప్రదేశమునకు చేర్చినారు. దీనితో మా వసది తలకొట్టినట్లయినది.

రాజపురుషులు ఈ అలుసు చూచుకొని యిప్పుడు అధికారపత్రములు లేకుండ అనాదిగా వసదిక్రింద నున్న ప్రదేశములను అందు మేము నిర్మించుకొన్న సమస్తభవనాదికములతో సహా స్వాధీనపరచవలసిన దని ఆజ్ఞాపించినారు ఈ యాజ్ఞలను అంబదేవులయంతి ప్రధానపురుషులు ప్రవర్తింప జేసినారు. ఈ యాజ్ఞలచే నికపై వసదికి రాకపోకలు గూడ జేయు నవకాశముండదు సాధువుల తపస్సునకును తీర్థంకరమూర్తుల పూజాదికములకును భక్తుల సేవలకును భంగము వాటిల్లును

వసది యిట్టి ప్రమాదావస్థలో నున్నది ఎవరో అజ్ఞానులు చేసిన చిన్న పొరపాటుకు వసదిపై నింత యాగ్రహించుట ధర్మమా ? వెంటనే ప్రభువులు వసది ననుగ్రహించి యీయాజ్ఞలు సరిచేసి మా రత్నసువర్ణములును స్ఫటికశిలయు మా కిప్పింప వేడుదుము మీకు తీర్థంకరుల ప్రసాదముచే అయురారోగ్యైశ్వర్యములు వర్ధిల్లుగాక !

ఇది యీ వినతి సారాంశము ! అంతయు ప్రభుభక్తితోడను గంభీరవాక్కులతోడను నిండి యున్నది దీనికి శుద్ధప్రతి ఎట్టి మనోజ్ఞమగు పత్రముపై నేరంగులతో వ్రాయవలెనో కూడ నాగాచారియే కరణమునకు స్పష్టముగా తెలిపెను మరియు నా పత్రము పూజ్యులగు సిద్ధనందద్యాచార్యులవారి పేరనే పంపుటకు గూడ నాతడు నిర్ణయించెను

కాని యీ పత్రము సిద్ధనంద్యాచార్యులయొద్దకు తీసికొనిపోగా దానిపై తన నామ ముంచుటకు వారు నిరాకరించిరి నిర్లజ్జుడగు తన కెందు కిది ? ఇంతవరకు తానేమి వ్యవహరించుచుండెను ? ఇది మాత్రము తనయొద్ద కేల తీసికొని రావలెను ? ఆ పత్రమును కరణము వినిపించినను ఆయన యది వినిపించుకొనలేదు వ్యవహర్తలకది సాధించుట కష్టమయ్యెను వారందరాలోచించుకొని యీ రాత్రి సిద్ధనంద్యాచార్యులు నిదురపోయి లేచి కలతనిద్దురలో నున్న సమయము కనిపెట్టి యేదో సాకు చెప్పి ఆయనకు తెలిసియు తెలియకుండ నున్న సమయమున నందుపై నాయననామ మంకితము చేయించుకొని తమయొద్ద నున్న ఆయన ముద్రికతో ముద్రించిరి

మరియు నా పత్రమును ఎవరు ఏవేళ ఏవిధముగా శ్రీ రుద్రదేవమహారాజులకు నివేదింపవలెనో కూడ నాగాచారియే నిర్దేశించెను ఆ వసతి పెద్దలును అతని యుపదేశమును సర్వథా సంభావించి అక్షరశః పరిపాలించిరి

ఆనాటి పూర్వాహ్ణసమయమున శ్రీ రుద్రదేవమహారాజు ధర్మాసన మధిష్ఠించి యుండెను అప్పుడు ఆ వసదిప్రధానకరణము కొందరు శ్రేణీపతులను వెంట గొనిపోయి వసదియధ్యక్షుని వినతి పత్రమును మహారాజులకు నివేదించెను. సిద్ధనంద్యాచార్యుల నామము

**(29 వ పేజీచూడుడు)**

# ★ ఖద్దరు విధానం ★

శ్రీ సహజానందం

"రాట్నసిద్ధాంతపు మూలసూత్ర మంతా ఒక్క యథార్థవిషయంమీద ఆధారపడి వుంది ఇండియాలో కోట్లకొద్దీ (చాలా కాలం) నిరుద్యోగులుగా ఉన్నారు. ఇదే ఆ యథార్థవిషయం అటువంటివారు లేని పక్షంలో రాట్నానికి స్థానం లేదని నేను ఒప్పుకుంటాను. కాని నిజానికి, మన పల్లెటూళ్లను చూసిన ప్రతివానికీ తెలుసు—గ్రామస్థులు నెలలతరబడి సోమరులుగా ఉంటున్నారని, ఆ సోమరితనం వారి నాశనానికి కారణం కాగలదని." గాంధీజీ. ('ఎకనామిక్స్ ఆఫ్ ఖాదీ' పే. 175)

కాంగ్రెసు అధికారంలోకి రానంతవరకు కాంగ్రెసేతరులు గాంధీజీని, కాంగ్రెసును ఎక్కువగా ఖద్దరువిషయంలో విమర్శించేవారు. ఇప్పుడు కాంగ్రెసువారిలో కూడా కొంతమంది ఈ విమర్శకుల ధోరణిలోనే మాట్లాడుతున్నారు.

ఖద్దరు! ఇదింకో చాదస్తం—మద్యపాననిషేధం మాదిరే. అనాగరికతకు ఖద్దరు ఒక లక్షణ మని కూడా కొందరి అభిప్రాయం

ఈ పారిశ్రామికయుగంలో రాట్నం, తకిలీ ఏమిటి? యంత్రశక్తి సిద్ధించినప్పుడు, ఇంకా మనుష్యులు చెమటోడ్చి, పాటుపడక్కర్లేదు. యంత్రమూలంగా మనుష్యశ్రమ తగ్గిపోతుంది. ఈసుఖాన్ని ఎందుకు పోగొట్టుకోవాలి? అని అంటారు విమర్శకులు.

ప్రకాశంప్రభుత్వం పతన మవటానికి ముఖ్యకారణం కాంగ్రెసువారి అధికారతృష్ణే అయినా, ఆ సందర్భంలో కొంతమంది ప్రకాశంప్రభుత్వపతనానికి కొన్ని ఆదర్శాలు కారణమని ఊహించుకొని, "ఏం ప్రకాశం! బట్టలమిల్లులు వద్దంటాడయ్యో! రాట్నాలు తిప్పిస్తా నంటాడు? ఇదెక్కడ చాదస్తం" అని విమర్శించేవారు.

ప్రకాశంవిధానంలో ఏమైనా లోపాలుంటే సరిదిద్దవచ్చు. కాని ఆ విధానం అమలుజరిగిఉంటే, పల్లెపల్లెల్లోని వేలకొలదీ జనం సోమరులుగా ఉండకుండా, ఏదో ఒక నిర్మాణకార్యక్రమంలో పాల్గొనేవారు. పల్లెల్లోని, చేతివృత్తివారికి గిరాకి తగిలేది. గ్రామాల్లోని ఆర్థికపరిస్థితి కొద్దో గొప్పో బాగుపడేది.

ప్రకాశం ప్రభుత్వం పోయి, కొత్త కాంగ్రెస్ప్రభుత్వా లేర్పడినా, ఖద్దరువిధానాన్ని తోసిపుచ్చలేదు. ఈ ఖద్దరువిధానాన్ని అమలుజరుపు తున్నందుకు కొంతమంది మంత్రులను ఇంకా విమర్శిస్తూనే ఉన్నారు.

ఖద్దరుసిద్ధాంతులు అనాగరికు లని, చాదస్తులని, తాము నవనాగరికుల మని, అభ్యుదయ గాము లని వీరి భావన

సోషలిస్టు, కమ్యూనిస్టుపార్టీల్లో కొంతమందికి కూడా మద్యపాననిషేధం అంటే ఎంత ఈసడింపో, ఖద్దరువిధాన మన్నా అంతే.

ఆర్థికంగా అత్యంతహీనస్థితిలో వున్న పాటకజనానికి తోడ్పడే మద్యపాననిషేధం, ఖద్దరువిధానం సమసమాజసిద్ధాంతులకు నచ్చకపోవటం విచిత్రం. బహుశ పాశ్చాత్యదేశాల్లోని సోషలిస్టుసిద్ధాంతాన్ని మక్కికి మక్కీగా, తూచాతప్పకుండా మన దేశంలోనూ అవలంబించాలనే భావం వీరి మనస్సుల్లో నాటుకొపోయి ఉండవచ్చు. యూరపు పారిశ్రామికఖండం అని, ఇండియా ముఖ్యంగా వ్యావసాయికదేశ మని వీరికి తెలియకపోలేదు. కాని 'సోషలిజం' యొక్క పరిణామం ఈ వివిధప్రాంతాల్లో ఒకేమాదిరిగా ఉండదు, ఉండజాలదు అనే విషయం వీరికి తగినంతగా బోధ అయినట్టు తోచదు. ప్రతిఘటనా విధానాల్లోనూ నిర్మాణ కార్యక్రమాల్లోనూ దేశానికి దేశానికి ఉత్పత్తివిధానాల బట్టి, చిత్తవృత్తిబట్టి చాలా మార్పులు కలిగితీరుతయి. ఇది క్షుణ్ణంగా అర్థంచేసుకొని గ్రహించనంతవరకు, మన దేశంలో సోషలిజం ముందడుగు వేయదు. కాంగ్రెసుప్రభుత్వాలతో ఇతరవిషయాల్లో ఎంత ప్రతిఘటించినా, ఈ రెండువిషయాల్లో_మద్యపాననిషేధం, ఖద్దరు–కాంగ్రెసుపార్టీతో, ప్రభుత్వాలతో ఈ వామపక్షాలు తప్పకుండా సహకరించి ఉండవలసింది.

ఖద్దరువిధానాన్ని చాదస్తమని అనటం తేలిక. కాని శుష్కసిద్ధాంతంగా కాక, ఇప్పటి మన దేశానికి ఖద్దరువిధానం అవసరమా కాదా అన్నవిషయాన్ని పరిశీలించాలి. యంత్రశక్తి దేశానికి తగినంత లభిస్తే, రాట్నమే కావాలని గాంధీజీ అనలేదు. మన మనుకున్నంతమాత్రాన రేపీపాటికి దేశం యంత్రమయం కాజాలదు. పారిశ్రామికవ్యాప్తికి ఏడాదికి కనీసం రు 500 కోట్లు పెట్టుబడి కావాలి. కాని యుద్ధ మారంభమైనప్పటినుంచి 1947 దాకా ఏడాదికి సగటున 20 కోట్లుమటుకే 'జాయింటు స్టాకు' కంపెనీల్లో పెట్టుబడికింద వినియోగింపబడుతోంది. ఈపరిస్థితి త్వరలో మారి వందలకు వందలకు కోట్లకొద్దీ పెట్టుబడి లభించే అవకాశాలు ఏమీ కన్పించట్లేదు. కాబట్టి పారిశ్రామికవ్యాప్తి సులభంగా, త్వరలో సిద్ధించేది కాదు

ఇంక మనదేశంలో ముఖ్యజీవనాధారం భూమి. 100 కి 70 మంది భూమిమీదే జీవిస్తున్నారు.

మన రాష్ట్రంలో పారిశ్రామికకార్మికుల సంఖ్య, (1947 లో) 2,76,586 వీరిలో 17,504 మందికి ఏడాదిపాటున పని ఉండదు.

$5\frac{1}{2}$ కోట్ల జనాభాలో, $3\frac{1}{2}$ కోట్లమంది పైగా భూమిమీద ఆధారపడి జీవిస్తున్నారు అంటే జనాభాలో 100 కి 64 మందికి వ్యవసాయమే జీవనం ఏడాదిపొటున పని ఉండదు 6 నెలలకు పైగా సోమరులుగా ఉంటున్నారు జనాభాలో అత్యధిక సంఖ్యాకులైన వీరి ఆదాయం పెరిగితేనే, రాష్ట్రం అభివృద్ధి చెందుతుంది

మరి ఇంతమందికి ఇప్పుడు వేరే పని పాటులు కల్పించటానికి మార్గా లేమున్నయ్ పరిశ్రమలు 3 లక్షలమందికి కూడా పని ఇవ్వలేకపోతున్నయ్ ఈ స్థితుల్లో పరిశ్రమల వలన నిరుద్యోగసమస్య తీరగలదని, యంత్ర సౌకర్యం కాయకష్టాన్ని తగ్గించగలదని అనుకోటం భ్రాంతి శ్రమదృష్ట్యాకూడా ఒక ప్రశ్న ఉద్భవిస్తుంది తయారైన యంత్రం ఉపయోగించుకొనేవాడికి కాయకష్టం తప్పిందిగాని, ఆ యంత్రాన్ని తయారుచేసే వారికి తప్పిందా ?

కాబట్టి 100 కి 64 మంది నిరుద్యోగులుగా, సోమరులుగా ఉన్న జనాభాకు జీవనవృత్తి ఏమిటి ?

ఈ యథార్థవిషయందృష్ట్యానే గాంధీజీ ఎక్కువగా ఖద్దరుసిద్ధాంతాన్ని ప్రబోధించాడు

రాట్నం తిప్పటంమూలంగా వచ్చే కూలీ ఎంత ? రోజుకు కొన్ని అణాలైనా రావు ఏం లాభం ? అంటారు

డబ్బుదృష్ట్యా ఇది నిజమే కాని ఇంతకన్న ఎక్కువ కూలీ లభించే మార్గం ఇప్పుడు ఇంకొకటి ఏది ?

పల్లెజనాభాలో- బస్తీల్లోలాగానే-కింది తరగతులవారిలో తప్ప, పైవర్గాల్లో స్త్రీ పురుషు లిద్దరూ సంపాదనకు పూనుకోరు పైవర్గాల్లో కొంతమంది ఇంటిపనికూడా చేసుకోరు కొంతమంది పురుషులు పిల్ల జమీందార్లలా పొలంగట్టుకూడా చూడకుండానే వ్యవసాయం చేయించుకుంటారు. అసలే అల్పంగా ఉన్న ఆదాయంతో వీ రందరినీ పోషించాలి

అలాగే బస్తీజనాభా బస్తీలో అధిక సంఖ్యాకులు మధ్యతరగతివారు వీరి కుటుంబాల్లో స్త్రీజనం ఏదో ఇంటి చాకిరీతో సరిపుచ్చుకోవటమే తప్ప, ఆదాయాన్ని వృద్ధి చేసే శ్రమకు పూనుకోరు ధరలు పెరుగుతున్న రోజుల్లో చిన్న ఉద్యోగస్థుల కొద్ది జీతాలతోనే వీరందరి పోషణ జరగాలి బస్తీల జనాభ (మన రాష్ట్రంలో సుమారు 55 లక్షలు వీరిలో సగంమందికిపైగా ఏమీ సంపాదించరివారే ఒకడి సంపాదనమీదే కుటుంబంయావత్తూ ఆధారపడుతోంది ఈ సోమరులు కూడా సంపాదించాలంటే, ఇప్పటి పరిస్థితుల్లో అవకాశా లేమిటి ? ఈ విషయాన్నికూడా దృష్టిలో పెట్టుకొనే గాంధీజీ ఖద్దరు అందరకూ ఉపయోగపడుతుం దన్నాడు

(32 వ-పేజీ చూడుడు)



పర్మినెంట్ నూ వలిఅంతిమదినమున తియబడిన చిత్రం ఫోటోలో సర్దార్ పటేల్, మధ్యప్రదేశ్ గవర్నరు మంగళదాసు పక్వాసా జయపూర్ మహారాజా, పాటియాలా యూనియన్, సౌరాష్ట్ర, తిరువాన్కూర్-కొచ్చిన్, రాజప్రముఖులు ఉన్నారు

# "పేదకు దొరికిన పెన్నిధి"

మూలం :
'స్టాసీ ఔమొనియర్'



అనువాదం :
శ్రీ నేమాని వీరభద్రరావు

మైకేల్ జాక్, జీవితములో ఢక్కామొక్కీలు తిన్నమనిషి రైలులో మూడవతరగతిపెట్టెలో ఒకమూల కూలబడి తను ఏపరిస్థితులమూలంగా అప్పటి హైన్యస్థితికి లోనుకావలసివచ్చిందో సింహావలోకనం చేసుకుంటున్నాడు. సూక్ష్మంగా చెప్పాలంటే అతని జీవిత గ్రంథంలో అప్పటికి వున్న ముఖ్యమైన శీర్షికలు తనకువున్న ముప్ఫై సంవత్సరముల వయస్సు - వివాహంకావటం - ఏమీ ఆర్జన లేకపోవటం- తల మునిగిన అప్పులు.

ఆక్స్‌ఫర్డులో చదువుతూవుండగా, అతనితండ్రి హృదయదౌర్బల్యంవల్ల అకస్మాత్తుగా మరణించినందున, వెంటనే చదువుకు స్వస్తిచెప్పి యింక వెనకాసరా ఎవరూ లేకపోవడంచేత, బస్తీకి పోయి ఏ వుద్యోగం లభ్యమవుతే అందులో ప్రవేశించక తప్పిందికాదు. అతని తల్లి యిదివరకే చనిపోయింది. ఏకైకసోదరి బర్మాలో ఒక మిషనరీని వివాహ మాడింది. ఆ పరిస్థితులలో మైకేల్ మంచిశరీరారోగ్యము గలవాడుగను ఆటలయందు మంచి అభిరుచిగలవాడుగను, ముందు రాబోయే కష్టపరంపరను వూహింపలేనివాడుగను వుండెడివాడు.

మైకేల్ తండ్రి మంచి మేధావి. ప్రపంచానుభవం కలవాడు. ఆదర్శప్రాయుడు. అతని ఆకస్మికమరణం అనేకమంది చర్చలకు లోనై, ఇదమిత్థమని ఎవరిచేతను తేల్చబడలేదు మైకేల్ భావి జీవితం విషయమై ఆయన ఆలోచనలన్నీ కార్యరూపం ధరించకుండానే వుండిపోయాయి.

స్నేహితుల సహాయం మూలంగా, మైకేల్ ఒక యిన్సూరెన్సుకంపెనీలో గుమాస్తాపని సంపాదించేడు. ఆ గుమాస్తాగిరీలో దొరికే తక్కువజీతంతోనే అతనిదినం గడుపుకుంటున్నాడు. కంపెనీలలో గుమాస్తాగిరీలకు అవసరమైన, టైపు, షార్టుహేండు, ప్రతిసాయంకాలం నేర్చుకొనేవాడు. మొదటిదినాల్లో కొంత వుత్సాహంతో పనిచేయగల్గినా ఆ పని, అతనికి తగదని తెలుసుకోడానికి ఎంతోకాలం పట్టలేదు. తనతో సమానంగా నేర్చుకుంటూన్న సోదరులలోని అభివృద్ధి తనలో కనబడనప్పుడు, దానికి తగిన మేధస్సు తనకులేదని గ్రహించి, తాను ఒక వృత్తి నవలంబిస్తే ఎంత బాగుంటుందో' అని విచారించసాగేడు. యిన్సూరెన్సుఆఫీసులో గుమాస్తాగిరి మానేసి అనేకమందిదగ్గర అనేకపన్లుచేసి, కడకు యింగ్లండులో మానసికపరిస్థితి బాగులేని ఒక యువకునికి నర్సుగా ప్రవేశించాడు. దానికికూడా కొద్దికాలంలోనే స్వస్తి చెప్పి, మింటింగ్ అనే యువకునితో పరిచయం సంపాదించి, యిద్దరూ కలిసివ్యాపారం చేయనిశ్చయించి, పెట్టుబడికి కొంతసొమ్ము చేకూర్చగలిగి, ప్రారం

భించిన ఒకటి రెండు మాసాల్లోనే, లాభం సంపాదించినతరువాతగాని, మైకేల్ కి మేఘాచ్ఛాదితమైన తన జీవితాకాశంలో మెరపులుకూడా లేకపోలేవన్న విశ్వాసం కుదిరింది గాదు. అక్కడ వున్నప్పుడే ఒక నాటకసంస్థకు యజమానిగా యున్నతనికి, కార్యదర్శిగా పనిచేయుచున్న, ఎలియనార్ తో పరిచయం కలిగి, ఆ పరిచయమే, ప్రేమగా మారి, కడకు యిద్దరూ, వివాహమాడటంకూడా తటస్థించింది. ఆ మరుచటి సంవత్సరమే, వారి నిష్కలంక ప్రేమకు ఫలితంగా ఒక ఆడుబిడ్డ కలిగింది. స్నేహితులిద్దరూ, ఒక గుమాస్తానుకూడా పోషింపగలుగుతున్నారన్న విషయం, వారి వ్యాపారం అభివృద్ధిలో వుందని చెప్పక చెపుతుంది.

మూడు సంవత్సరాలు మైకేల్ జీవితం సుఖంగా దొర్లిపోయింది. జూలై నెలలో ఒక దినమున, వారి శాంతిమయజీవితసరోవరంలో అలలు బయలుదేరాయి. మైకేల్ భార్యాసహితంగా, పదిహేను దినముల క్రిందటే సముద్రయానానికి బయలుదేరాడు. ఆఫీసుకు శలవుదినములు. వారు తిరిగివచ్చిన తరువాత, మింటెంగ్ వెళ్లుటకు నిశ్చయించారు. మైకేల్ తిరిగి వచ్చుసరికి ఆఫీసులో గుమాస్తా ఒక్కడే వున్నాడు. "మింటింగ్ కూడా, మైకేల్ బయలుదేరిన మరుచటిదినమే, ఆఫీసు విడిచి ఎక్కడికో పోయెనని గుమాస్తా చెప్పగా విని, మైకేల్ ఆశ్చర్యపోయాడు. మింటింగ్ ప్రవర్తనలలో వున్న రహస్యం తెలుసుకోడానికి ఎంతో కాలం పట్టలేదు, వారి వ్యాపారమునకు వుంచబడిన పెట్టుబడి సొమ్ము మింటింగ్, బ్యాంకులోనుండి తీసి పరారయినాడు.

మైకేల్ యీ విషయం భార్యచెవిని వేయలేదు. తాను చేయవలసిన ప్రయత్నం అంతా చేసి, కడకు నిస్పృహ చెందక తప్పిందిగాదు. తన దగ్గర వున్న కొద్దిసొమ్ముతోనూ, తీర్చవలసిన బాకీలన్నీ ఎలా తీరుస్తానో అన్న బెంగ అతన్ని సగంభాగం క్రుంగదీసింది. తాను స్వంతంగా వ్యాపారం నడపడం అసంభవంఅని, నిశ్చయించుకున్నాడు. అక్కడక్కడ నాలుగైదు పౌనులు బదులుచేసి గుమాస్తాకు యివ్వవలసిన జీతం యిచ్చి, ఆ బాధ్యతి ముందుగా వదల్చుకున్నాడు. ఈ కష్టాలన్నీ మన శాంతిని భంగంచేస్తూవుంటే అతడు మొదట పెట్టుబడికి తెచ్చిన ఏభై పౌనులు వెంటనే యియ్యవలసినదని ఒత్తిడి కలగజేసేరు. తాను స్వయంగా వెళ్లేడు. కష్టాలన్నీ ఏకరువు పెట్టేడు. ప్రార్థించేడు. కాని ఆ ఋణదాత హృదయం చెమర్చలేదు. పైగా మైకేల్ని, అసమర్థుని క్రింద జమకట్టి, యీసడించేడు.

"తాను దివాలాతీసేనన్న విషయం ఎలియనార్ తో చెప్పక తప్పదు. సుస్వభావం కలిగిన ఆమె ఏసమాధానంయిస్తుందో అతను వూహించాడు. ఆమె అతననుకున్నట్లుగానే అంది. "తిరిగి మనరోజులు బాగుపడకపోవు. బెంగపడవద్దని ఓదార్చింది. కంపెనీలలో వుద్యోగంచెయ్యడానికి గల సమర్థత ఎలియనార్ వద్ద వుంది. వెంటనే ఆమె కాగితం తయారుచేయు ఒక మిల్లుయజమానివద్ద కార్యదర్శిగా ప్రవేశించింది. పనిసమయంలో పిల్లని, మంచి స్వభావం గల పొరుగువారికి వప్పగించిపోతూంది. జూలై నెల ఆగష్టునెల మైకేల్ ఖాళీగానే యున్నాడు. సెప్టెంబరునెలలో మాత్రం ఒక షాపులో గుమాస్తాగా ప్రవేశించాడు. వచ్చే రాబడి చాలా తక్కువైనందున, తక్కువ అద్దెగల యింట్లో ప్రవేశించాడు. వచ్చేరాబడి చాలా తక్కువైనందున యీ దుస్థితి కలిగిందని భార్యతో చెప్పినపుడు ఆమె చిరునవ్వు నవ్వి "మనకష్టాలు డబ్బుకు సంబంధించినవైతే నేను లెఖచేసేదాన్ని కాను. ఆ దయామయుని దయవల్ల మరే కష్టాలు మనలను చుట్టుముట్టకుండా వుండాలి" అంటుంది. ఆమె అనుకున్నట్లుగానే ఒక సంవత్సరంవరకు వారి కష్టాలు ఆర్థికసంబంధమైనవి గానే వున్నాయి. తర్వాత ఎలియనార్ ఒక బిడ్డను కని ఆ బిడ్డనూ, ఆరోగ్యాన్నీ కూడా కోల్పోయింది. మైకేల్ యిదివరకు ఏభైపౌన్లు యిచ్చిన ఋణదాతవద్దకే వెళ్లక తప్పిందిగాదు. కాళ్లావేళ్లా పడి మరి పదిపౌనులు మాత్రం అప్పు తేగలిగేడు. మూడునెలలు ఎలియనార్ అనారోగ్యంచేత బాధపడి, తిరిగి పనిలో ప్రవేశింపగలిగింది. యీ మధ్యకాలం వారు పడిన కష్టాలు ఆ భగవంతునికే ఎరుక. రొట్టె పాలమీద, యిన్నాళ్లూ బ్రతకడంచేత మైకేల్ చాలా చిక్కిపోయాడు. మైకేల్ యింతవరకు ఏ అనుభవాలు జీవితంలో సంపాదించగలిగేడో, ఏ బాధలకు గురి అయ్యాడో వివరించడం విసుగుదల అయిన విషయం. చెప్పవలసిన సంగతి, మైకేల్ తిరిగి నిరుద్యోగి అయ్యాడు యిదివరకు బదులు యిచ్చిన మనిషిదగ్గరకే మరొకసారి వెళ్ళేడు. ఆవ్యక్తి మైకేల్ కి దూరపుబంధువు కాడు. కేవలం పినతండ్రి... వడ్డీవ్యాపారం చేస్తున్నాడు. బస్తీరొదల నుండి దూరంగా వుండి, భార్యా ధనమూ యీరెండింటిమీదను తన దృష్టిని కేంద్రీకరించి అదే ప్రపంచమని వుంటాడు. అతనేం కావలసినా అతని ధనమే చేకూరుస్తుంది.

మైకేల్ తండ్రి, పినతండ్రులమధ్య బద్ధవైరము, ఒకరంటే మరొకరికి తగని ద్వేషం. అందుచే పినతండ్రి అన్నగారితో సంబంధం. ఏనాడో త్రెంచుకొని దూరంగా వున్నాడు. అతడు తల్చుకుంటే మైకేల్ని ఒక వృత్తిలో ప్రవేశపెట్టగలిగేవాడే. కాని ఆ వుపకారం చెయ్యటం ఎంతమాత్రం యిష్టం లేదు. వచ్చినప్పుడు, ఏదో ముష్టివానికి విదిల్చినట్లు విదల్చడం, అతని తండ్రియొక్క దుర్గుణాలను ఒక్కసారి వర్ణించి, మైకేల్ని చిన్నబుచ్చడం జరుగుతూంది. జీవితంలో మైకేల్ యొక్క అపజయాలను చూసి పినతండ్రి సంతోషిస్తున్నాడని మైకేల్ అభిప్రాయం. ఈసారి ఎంత ప్రార్థించినా అతని మనసు కరుగలేదు. "నీ బ్రతుకు నీవు చూచుకోవాలిగాని ఎంతకాలం నీకు నేను సహాయంచెయ్యగలను." అని, నిష్కర్షగా అన్న వాక్యాలు తల్చుకొని, భార్యా బిడ్డల కొరకు తాను యీ కష్టాలన్నీ అనుభవిస్తున్నానని సమాధానపర్చుకొని, ఆ రాత్రి అక్కడ గడపి, వచ్చేసమయంలో పినతండ్రి యిచ్చిన మూడు పౌనులు పట్టుకొని యింటికి వస్తున్నాడు. ఈ సింహావలోకనములో అతనికి యితరుల సంభాషణలుగాని, మరే గొడవగాని పట్టడమే లేదు. రైలువాటర్లూ స్టేషనులోనికి వచ్చింది. అతనికి గమ్యస్థానం కూడా అదే. తన సంచితీసుకొని దిగేడు. కాని చాల నీరసమనిపించింది. "భగవంతుడా నాకు జబ్బుచేయదు కదా' అనుకున్నాడు. రాత్రికట్టుకొనే దుస్తులుతప్ప ఆ సంచిలో మరేమీ లేవు. అదే పెద్దబరువనిపించి, గేటులోనుంచి వెళ్ళేటప్పుడు కళ్లుకూడా తిరిగాయి. అక్కడ ఒక బండిని చూడగానే, తాను దానిమీదపోతే బాగుండుననిపించింది. తాను ఎక్కబోయే బండిలోనుండి యిద్దరు పెద్దమనుష్యులు

(26 వ పేజీ చూడుడు)

ఢిల్లీ లేఖ:

# రాజ్యాంగచట్టాలకు, అతీతులు లేరు!



శ్రీ కృష్ణ

ఈ వారం న్యూఢిల్లీలో ఆదుర్దా ఎక్కువగా ఉంది. ప్రజాస్వామ్యం పురిటినొప్పులు పడ్డ దీవారం.

ఈ వారంలో యూనియన్ పార్లమెంటు ఈ వారంలోవచ్చిన సర్వవిధమైన గ్రాంటులనన్నిటినీ అనుమతించింది. "ఖర్చులు తగ్గించుకోవాలి" అన్న ప్రాథమికసూత్రాన్ని, "సామాన్యమానవుని" ప్రతినిధులమనిచెప్పే, గౌరవ సభ్యులు ఎవరూకూడా పాటించినపాపాన పోలేదు. గ్రాంటులకు ఒప్పుకొన్నారుకాబట్టి, కావలసిన డబ్బు రాబట్టే విధానాన్నికూడా ఫైనాన్సుబిల్లురూపంలో నెలాఖరులోనే వెలువరుస్తారు.

విదేశాంగశాఖఅంచనాల చర్చలు, ఇండోపాకిస్తాన్ బాంధవ్యాలు, ముఖ్యంగా తూర్పుబెంగాలుపరిస్థితీ, మంచి ఉత్తేజాన్ని కలిగించాయి. మన విదేశాంగ విధానం, పరిపూర్ణంగా విఫలమయిందనీ, దాన్ని ఆచరణలోపెట్టే బాధ్యతఉన్నవారంతా, కేవలం మొండితర్కం అవలంబిస్తున్నారనీ, నిస్సందేహంగా ప్రతివారికీ నమ్మకం కలుగుతూంది. ఆ మర్నాడు ఒక వార్తాసంస్థ ప్రచురించిన వార్తప్రకారం, ఇండో పాకిస్థాన్ సంయుక్తప్రకటనవిషయంలో, ప్రధానికి మంత్రివర్గంవారి ఆమోదమే కలగలేదనీ, తదనుగుణంగా, గతబుధవారంనాటి కాంగ్రెస్‌పార్టీసమావేశంలో చాలా గగ్గోలయిందనీ తెలుస్తూంది. కొందరు సభ్యులు గుసగుసలాడటంతో ప్రధానమంత్రికి ఒళ్లు మండుకొచ్చిందట.

అథవా మాటవరసకు చూచుకొన్నా, రాజ్యాంగచట్టవిధానాలకూ శాసనాలకూ, ఏ ప్రత్యేకవ్యక్తి అయినాగూడా లోగి ఉండవలసినవారేతప్ప మించవలసినవారు కారు. కామత్ విరామతీర్మానంపై రూలింగ్ ఇస్తూ అధ్యక్షులు మావలంకర్, బ్రిటిష్, కామన్సుసభఆచారాలను విరివిగా ఉదహరించసాగారు. "బ్రిటిష్ రాజ్యాంగనీతికిగాని, సాంప్రదాయాలకుగాని కట్టుబడిఉండాల్సిన ఆవశ్యకత అంటూ ఏమీ లేదు. ముమ్మాటికీ లేదు. కానీ, కొత్తసాంప్రదాయాల నేర్పరచుకొనేందుకు, అవి మార్గదర్శకంగా భావించవచ్చును అని "ఉటంకించారు" అయితే ప్రధానికి, మంత్రివర్గం, వీరి అధికారాల విషయం అభిప్రాయభేదం వచ్చినప్పుడు, బ్రిటిష్ సాంప్రదాయాలలో మన కేమయినా సూచనదొరుకదా? ప్రొఫెసర్ కీత్ బ్రిటిష్ కాన్స్టిట్యూషన్ గురించి వ్రాసినది కొంత ఉదాహరిస్తాను.

"మంత్రివర్గాన్ని ఒక చర్యకు బాధ్యులను చేసేముందు, మంత్రివర్గాన్నంతనూ సంప్రదించవలసిన బాధ్యత, ప్రతిమంత్రిమీద మాత్రమేకాకుండా ప్రధానమంత్రికికూడా ఉంది. 'ఏకగ్రీవంగా' తీర్మానించవలెనన్న సూత్రంప్రకారం, మంత్రివర్గమంతా ఆమోదించని విధానాలను ప్రచురించేందుకు ఏమంత్రికీ హక్కు ఉండదు" అని వ్రాశాడు.

రెండువిషయాలు తేలుతున్నాయి. ఏవిధానమైనా ప్రచురించి ఆచరించేముందు మంత్రివర్గాన్ని సంప్రదించి తీరాలి అనేది రూఢిఅవుతుంది. తర్వాత మంత్రివర్గం ఆమోదంలేని ఏ విధానాన్ని ఏమంత్రీ ప్రకటించే హక్కు లేదని తేల్తోంది. ఇండో పాకిస్తాన్ సంయుక్తప్రకటనవిషయంలో, మంత్రివర్గంలో చర్చ జరిగింది. ఆమోదం పడయలేదు. అల్లాంటప్పుడు, తన ప్రభుత్వం నిర్ణయించినట్లుగా ప్రధానమంత్రి ఇదిపార్లమెంటులో ప్రకటించటంలో, తన పరిమితులలో వ్యవహరిస్తున్నాడా అనేది ప్రశ్న.

పోనీ కాంగ్రెస్‌వారు ఒప్పుకొనే లాస్కీ మాటే విందాం.

"పార్లమెంటరీ ప్రభుత్వాన్నిగురించి చెప్తూ, హెరాల్డు లాస్కీ, ఇల్లా అన్నాడు. "తన సభ్యుల సభకు అమెరికన్ అధ్యక్షుడు యజమానిఅయినవిధానంలో, ప్రధానమంత్రి తన మంత్రాంగానికి యజమాని కాడు. అతనికి ఎక్కువ అధికారాలున్నమాట నిజమేకాని, మంత్రివర్గాన్ని నయాన్నో భయాన్నో ఒప్పించి వాడుకోవలసినవి మాత్రమే ఈ అధికారాలు."

ముఖ్యంగా విదేశాంగవిధానంలో, తన మంత్రుల సమ్మతి లేకుండా, తన చర్యకు మంత్రాంగమంతటినీ కూడా బాధ్యులను చెయ్యటానికి, విదేశాంగమంత్రికి హక్కు లేదని స్పష్టమౌతూంది. ఇదే దోవను సాగితే ఫాసిస్టురాజ్యమౌతుందంటాడు, డాక్టరు జెన్నింగ్సు. తమ సూత్రాలలో కాకుండా తమలోనే నమ్మకముంచమని ప్రజలను బలవంతపెట్టటమే ఔతుంది.

మంత్రివర్గంలో అధికసంఖ్యాకుల అభిప్రాయానికి విభేదించిన మంత్రుల విషయంలో, బ్రిటిష్‌ప్రధానమంత్రి పారిస్‌బరో ఇల్లా అన్నాడు. ప్రతి మంత్రివర్గసమావేశము తీర్మానించినవిషయాలన్నిటిలోనూ పాల్గొన్న ప్రతి మంత్రీ, ఆ విషయంపై రాజీనామా ఇచ్చిఉంటే తప్ప, కేవలం విభేదించానని గాని, లేక అప్పటికి తనను లొంగదీశారని చెప్పి, మంత్రివర్గసమిష్టి బాధ్యతలో తనకుగల బాధ్యతను తప్పించుకోటానికి సుతరామూ వీలులేదు. అందుచేత మంత్రివర్గంచేసిన తీర్మానాన్ని మంత్రివర్గంలోని ప్రతిమంత్రీ స్వీకరించి తీరాలి. రాజీనామా ఇయ్యాలి. అల్లా లేదా రాజీనామా యియ్యకుంటే, కేవలం అప్పుడు అభ్యంతరం చెప్పిఉన్నా కూడా, ఆ తీర్మానం ఒప్పుకొన్న మంత్రులకెంత బాధ్యత ఉందో తనకూ అంత బాధ్యతే ఉందని స్వీకరించితీరాలి."

ఇది 1878 లో బ్రిటిష్ ప్రధానమంత్రి చెప్పినమాట.

పార్లమెంటరీవిధానం అంటే, ఏ ఒక్క వ్యక్తి లేనంతమాత్రానా ఆగిపోని విధానం అంటాడు లాస్కీ.

(34 వ పేజీ చూడుడు)

# ప్రపంచపురోగతి: అమెరికా తిరోగతి

**శ్రీ చలమాల ధర్మారావు**

మానవుడనాదినుంచీ సౌఖ్యవంతమైన జీవితంకోసం అఖండప్రయత్నం చేస్తూనే వున్నాడు. అతడు తదాశయసిద్ధికొఱకు చేస్తున్న ఆ మహాప్రయత్నమే అసంఖ్యాకమైన సంగ్రామాల కాకరమైంది. అనేకరక్తపాతాలకు కారణమైంది. అనేక రాజ్యాలు తలెత్తటానిక్కీ, తిరిగి పతనంచెందటానికీ హేతువైంది. ఆ మహాప్రయత్నమే మానవుణ్ణి ఆకాశపథంలో విహంగంలా విహరింపచేసింది. సముద్రాంతర్భాగములోనికి చొచ్చుకుపోయేటట్టు చేసింది భూమిని భేదించి భూగర్భంలో ప్రవేశింపచేసింది. ఆ మహాప్రయత్నంలోనే, మానవుడు పదార్థాన్ని అణువులుగా బ్రద్దలు కొట్టాడు. అణువుల్ని పరమాణువులుగా ఛేదించాడు. అంతేకాదు. ఆ అవిరామప్రయత్నమే కుంటివారికి కృత్రిమమైన కాళ్ళనిస్తోంది. గ్రుడ్డివారిని తిరిగి చూడసమర్థుల్ని చేస్తోంది. చెవిటివారికి మరల శ్రవణశక్తి నిస్తోంది. ఆఖరుకు కృత్రిమమైన మానవుణ్ణే తయారు చేస్తోంది. ఆ లక్ష్యసిద్ధికొఱకు జరిగే ఆ ప్రయత్నంలోనే మానవుడు ఆదర్శవంతమైన మానవసమాజాల్ని కలలుగన్నాడు. సౌఖ్యవంతమైన సాంఘికవ్యవస్థల్ని వూహించుకొన్నాడు. కాని అతడు యుగయుగాలుగా చేస్తున్న ఆ తపస్సు ఫలించనేలేదు. యుగయుగాలుగా అతడు పొందుతున్న పరితాపం ఇంకా చల్లారలేదు. యుగయుగాలుగా వాంఛిస్తున్న శాంతి ఇంకా అతనికి లభ్యముకాలేదు. పైగా అతడు మరింత ఆవేదన పొందుతున్నాడు. మరింత అశాంతికి లోనవుతున్నాడు.

ఈనాటి ప్రపంచం అతనికి సరిగ్గా యీ సత్యాన్నే బోధిస్తున్నది. అతడు సృష్టించుకొన్న రాజకీయాలు, వాటి ఆశయాన్నే విస్మరించి, వాటి యిష్టమొచ్చినట్టు మానవుని జీవితంతోనే చెలగాటం ఆడుతున్నాయి. రాజకీయవేత్తలు ఒకవంక ధర్మసూక్తులు వల్లిస్తూనే మరోవంక మారణహోమాలకు సన్నద్ధమవుతున్నారు. వారికి కనపడేది హైడ్రోజన్ బాంబేగాని తిండికి అలమటించే పేదప్రజానీకపు ఎండుకుపోయిన పొట్ట గాదు. వారికి వినపడేది యుద్ధఘోరీతేగాని దరిద్రమానవుని ఆక్రందనలు గావు, వ్యూహాలపై వ్యూహాలు, ఎత్తులపై యెత్తులు వేసుకుంటూ, ఒక వినోదంలాగు నడుపుతున్న వారి యీ రాజకీయాలకు అర్థం యేమిటో! . . .

ఇప్పుడు రెండుకూటములుగా చీలిపోయిన ప్రపంచరాజకీయరంగంలో అమెరికా ఒక కూటమికి నాయకత్వం వహిస్తోంది. అనేక శతాబ్దాలుగా పరదాస్యంలో క్రుగ్గి ఇప్పుడిప్పుడే నవజాగృతితో ముందుకొస్తూ ప్రపంచరాజకీయరంగంలో అత్యంతప్రముఖపాత్ర వహించనున్న ఆసియాఖండం యెడల అమెరికాదృక్పథం యెట్టిదో, సౌఖ్యంకోసం మానవులు చేస్తున్న ఆ తీవ్రప్రయత్నానికి అది చేస్తున్న దోహదం యేట్టిదో తెలిసికోటం చాల అవసరము.

ఇప్పుడు అమెరికాలో కేపిటలిస్టు వ్యవస్థ అమలులో వుంది. రెండవ ప్రపంచయుద్ధంలోనే కేపిటలిజం బాగా దెబ్బతిన్నది. దానికి తోడు, ఇప్పుడమెరికాలో నిరుద్యోగుల సంఖ్య రోజురోజుకు ఎక్కువైపోతోంది. ఒకవైపున ఆకాశాన్నంటుతున్న సౌధాలున్నా, మరోప్రక్క దారిద్ర్యదేవత తాండవిస్తున్న జీర్ణకుటీరాలున్నాయి. అది ప్రపంచానికంతా అప్పు పెడుతున్నా, తన దేశంలో ఎన్నో ఆర్థికసమస్యలెన్నెదుర్కొంటోంది. దీని ఫలితం ఎంతగా వున్నదంటే, అసలు కేపిటలిస్టువ్యవస్థే కూకటివ్రేళ్ళతో కూలిపొయ్యే పరిస్థితి యేర్పడుతోంది. దీనికి తోడు ప్రతిపక్షానికి నాయకత్వం వహిస్తున్న రష్యా ఈ పరిస్థితుల్నాధారంగా జేసికొని కేపిటలిస్టువ్యవస్థ బలహీనతను ప్రపంచానికి చాటుతున్నది. దీనితో అమెరికాకు గంగవెర్రులెత్తి, ఎట్లాగైనా తన వ్యవస్థను కాపాడ్డకోవడానికి ముప్పుతిప్పలు పడుతున్నది. తన ఆర్థికసమస్యల్ని చక్కబెట్టుకోటంకొఱకు తన పెట్టుబడిదారులచే యూరపు ఆసియాదేశాల్లో పరిశ్రమల్ని స్థాపించటానిక్కూ పూనుకొంటున్నది. కమ్యూనిజంబూచిని చూపెట్టి ఆసియాదేశాల్ని తన వుచ్చులో బిగించాలని చూస్తోంది. ఆసియాపునరుద్ధరణే మాకు లక్ష్యమని చాటుతోంది. ఒకవంక ఆసియాలో తిండి కరువై ప్రజలు అలమటించిపోతోంటే, వుత్పత్తిఅయిన పంటలు అమెరికాలో, మార్కెట్టుకోసం తగలబెట్టబడుతున్నాయంటే, ఆపెట్టుబడులు ఆసియావాసుల క్షేమానికో, కాదో మనం సులభంగా వూహించుకోవచ్చు.

అంతేకాకుండా అది కొన్ని ఆసియారాజ్యాలలో రేకెత్తుతున్న స్వాతంత్ర్యపిపాసనైన గమనించకుండ, తిష్ఠవేసుకకూర్చొన్నది. చైనాలో కొమింటాంగు పతనం చెందటంతో, ఆసియాలో అమెరికా కుడిభుజం కూలినట్టయింది. కాని ఆ చైనా నుండి కూడ అమెరికా గుణపాఠం నేర్చుకోకపోవడం దాని దురదృష్టము. జపానులో మిలిటరీప్రభుత్వం స్థాపించి ప్రభుత్వం చెలాయిస్తోంది జపాను ప్రజలకు స్వాతంత్ర్య మివ్వటానికి నిరాకరిస్తోంది. కొలంబోసమావేశంలో నెహ్రూ జపానునుంచి తరలి పొమ్మని, నూతనచైనాను గుర్తించమని అమెరికాను హెచ్చరించాడు. కాని అమెరికా ఆ హెచ్చరికను పెడచెవిని పెట్టింది. ఇలాగే దక్షిణకొరియాలో కూడ సైనికప్రభుత్వాన్ని సాగిస్తోంది. తన సరిహద్దుల్లో రష్యాకు వ్యతిరేకంగా సైనికస్థావరాన్ని నిర్మించుతోందని కూడ వార్తలు వస్తున్నాయి.

పైగా, మంచూరియాను రష్యా కబళింపచూస్తోందని ప్రపంచరాజ్యాలలో దుష్ప్రచారం చేస్తోంది. ఈప్రచారం రష్యాయెడల చైనీయులకు అసంతృప్తిని రేకెత్తించి తన ప్రాబల్యాన్ని విస్తరించుకోటానికి పనికివస్తుంది. టిటోనుంచి గుణపాఠం నేర్చుకొంటూన్న రష్యా చైనాలో యీవిధానం అవలంబించటం, నమ్మదగిందిగా లేదు. ఇప్పటికి రెండున్నర దశాబ్దాలనుంచి కొమింటాంగ్ వర్గంతో పోరాడి, ఇప్పుడే తన ప్రభుత్వాన్నేర్పరచిన మావ్. మంచూరియాను వదులుకొంటూ డనుకోవడం అతని వ్యక్తిత్వాన్నే శంకించటం అవుతుంది. ఇక ఇండోచీనాసంగతి చూద్దాము హోచిమను నాయకత్వంక్రింద జాతీయశక్తులు

ఎంతో కాలంనుంచీ పోరాడుతూవున్నా, ప్రగతిపథం గుర్తించని ఫ్రెంచిసామ్రాజ్యవాదం, తన మనుగడకు విశ్వప్రయత్నాలు చేస్తూ, ప్రజలసానుభూతి లేని, బావోడైని తనచేతి కీలుబొమ్మగా అక్కడ ప్రతిష్ఠాపన చేసింది.

అమెరికా యీ కీలుబొమ్మప్రభుత్వాన్నే గుర్తించింది. అంతకుముందే హోచిమన ప్రభుత్వాన్ని సోవియటు గుర్తించింది. ఈవిధంగా ఆదేశం రెండు విభాగాలైంది. పాశ్చాత్యశక్తుల దురహంకారం కారణంగా ముక్కలైపోయిన ఆసియా రాజ్యాలలో ఇది మూడవది. మొదటిది ఇండియా, రెండవది పాలస్తీనా, మూడవది వియత్నాం.

అమెరికాచే అనుసరించబడుతూన్న యీ అభివృద్ధినిరోధకవిధానమే, కాశ్మీరు వ్యవహారాల్లో ప్రవేశించింది. పాకిస్థాన్ దుష్టబుద్ధి లోకానికి తెలియంది కాదు. దురాక్రమణకోసం కాశ్మీరులోనికి తన సైన్యాల్ని ప్రవేశపెట్టటం, అయినా కాశ్మీరులో తన సేనలు లేవని సమితి (ఐక్యరాజ్యసమితి)లో బోకరించటం, తరువాత విధిలేక వప్పుకొనటం దాని నీచత్వాన్ని బట్టబయలు జేస్తున్నాయి. పైగా కాశ్మీరు తనకు తానై ఇండియన్ యూనియన్‌లో చేరటానికి సన్నద్ధపడుతోంటే, పాకిస్థాన్ దాన్నెలాగైనా తన అధీనంలోకి తెచ్చుకోవాలని చూస్తోంది. అమెరికా దీనికి పూర్తిమద్దతునిస్తోంది. వీలుగావుంటే కాశ్మీరును రెండు భాగాలు చేయాలని చూస్తోంది. ఆసియాలో తన కమ్యూనిజాన్ని వ్యాపింపచేస్తోన్న రష్యాకు, పాకిస్థాన్ కూడగట్టుకొని పక్కలో బల్లెమై కూర్చోవాలని అమెరికా యెత్తు. అందుకే అది ప్రజాభిప్రాయాన్ని కాలదన్నుతోంది.

యూరపులో అమెరికాచేతిక్రింద వున్నరాజ్యం పశ్చిమజర్మనీ ప్రపంచసంగ్రామం ముగిసి నాలుగుసంవత్సరములైనా జర్మనీలో పరిస్థితులింకా చక్కబడలేదు. అక్కడ నిరుద్యోగం మొదలైన సమస్యలింకా పరిష్కారం కాలేదు. అశాంతివాతావరణం ఇంకా తగ్గలేదు. ఈపరిస్థితుల్లో, అమెరికా అక్కడ సైనికబలాల్ని కేంద్రీకరిస్తోంది. పశ్చిమజర్మనీలో నాజీపార్టీ తిరిగి తలయెత్తుతున్నదని కూడ వార్తలువస్తున్నాయి. ప్రభుత్వంలో కూడ నాజీపార్టీసభ్యు లున్నట్టు తెలుస్తోంది. ఇవే నిజమైనచో అమెరికా అక్కడ తగినకట్టుబాట్లు చేయటం మిక్కిలి అవసరము. కన్నుగానని దురహంకారంతో ప్రపంచాన్నే కబళింపచూసిన నాజీపార్టీ తిరిగి తలయెత్తే అవకాశాలు కల్గటం ఏమాత్రం అభిలషణీయం గాదు.

ఇది ఇలా వుండగా అమెరికా, హైడ్రోజనుబాంబు నొకదాన్ని రాజకీయరంగంలోనికి వదలింది. నిన్నమొన్నటిదాకా, రష్యాకు ఏటంబాంబులు లేవనీ, తనదే పైచెయ్యి అని విఱ్ఱవీగింది. కాని రష్యాకూడ వున్నవని తెలియగానే దాని ఆటలు కొంతవరకు కట్టినవి. మరల ఇప్పుడు హైడ్రోజనుబాంబును సృష్టించి మానవజాతిమనుగడనే వెక్కిరిస్తోంది. ప్రపంచవిఖ్యాతినిగన్న విజ్ఞానశాస్త్రవేత్తఐన్‌స్టీన్, రేడియోధార్మికశక్తుల ప్రభావంవల్ల కొన్ని శతాబ్దాలవరకు జీవకోటి వుద్భవించే అవకాశమే లేదని మానవకోటిని హెచ్చరిస్తున్నాడు. ఈ బాంబుల్ని తయారుచేయవలసిందిగా ట్రూమన్ మొన్ననే వుత్తరువుకూడ చేశాడు. ఒక్కొక్క బాంబుకు నూరుమిలియన్ల డాలర్లు ఖర్చవుతుందని అంచనా వయ్యబడ్డది. అసలే ఆర్థికచిక్కులకు లోనవుతున్న అమెరికా ఇంత వ్యయప్రయాసలతో తయారుచేసిన బాంబుల్ని తన ప్రతిపక్షులమీద! వెయ్యకుంటా ఎంతకాలం వుంచగలదు? తన ఆర్థికవ్యవస్థ పతనం చెందేలోపుగానే ఆబాంబుల్ని ప్రయోగించటాన్కి పూనుకోవడం అసంభవం. ఆ పరిస్థితుల్లో, మానవజాతివునికికే ప్రమాదం రావటంకూడ సంభవమే. కావున మానవత్వాన్ని ప్రేమించే ప్రపంచప్రజాస్వామికవాదులంతా యేకమై మానవసంతతికి రాగల యీమహోపద్రవాన్ని యెదుర్కోవాలి. అగ్రరాజ్యాలచేత ఆయుధవిసర్జన చేయించాలి.

రాజకీయరంగం వదలితే, అమెరికాలో జరిగే అత్యాచారాల్లో ప్రథమముగా లెక్కించతగినది జాతివిచక్షణ. సోదరమానవుని - అతడు మరియొకజాతివాడైనంతమాత్రాన - మానవత్వాన్నే విస్మరించి, హృదయంలేకుండా హింసించడం, నిజంగా ఎంతనీచము! అనుదినజీవనంలో అక్కడ నీగ్రోలకు జరిగే ఘోరాలు వర్ణనాతీతము. నల్ల శరీరము కల్గిన మనిషికి అమెరికాలో స్వేచ్ఛాయుతమైన పౌరస్వత్వహక్కులు లేవు. ఎంత అన్యాయంగా తెల్లవాళ్ళు నల్లవాళ్ళని చంపినా, అవి ఏదో సాకులతో త్రోసివేయబడుతూవుంటవి. అసలు అమెరికన్ జీవితవిధానంలో జాతివిచక్షణ చూపటం, ఒక ప్రధానభాగంగా తయారయిందని "హేవుడ్" అనే రచయిత "నీగ్రోల దాస్యవిమోచన"అనే గ్రంథంలో వ్రాశాడు. అసలు నీగ్రోలు సహజంగా నీచులు అనే మనస్తత్వం అమెరికాప్రజల్లో నాటుకుపోయింది. నీగ్రోలు బహిరంగసభల్లో మాట్లాడ్డానికిగాని, తెల్లవారి హోటళ్లలో బసచెయ్యటానికిగాని అవకాశాలు లేవు. ఆఖరుకు బీచ్‌ల్లోకూడ విచక్షణావిధానం అమలులో వున్నది. విశ్వవిఖ్యాతశాస్త్రజ్ఞుడు ఐన్‌స్టన్ నీగ్రోలపై వ్రాసిన ఒక వ్యాసం, ఏ ప్రముఖపత్రికలోను స్థానం దొరకక ఒక సం॥ తరువాత ఒకమారుమూలపత్రికలో ప్రకటించబడిందంటే, అమెరికాలో జాతివిద్వేషం ఎంత ప్రచండరూపం దాల్చి విలయతాండవం చేస్తున్నదో మనం వూహించవచ్చు. తన దేశంలో ఈవిధంగా జరుగుతుంటే, మిత్రరాజ్యసమితిలో దక్షిణాఫ్రికాప్రభుత్వం భారతీయులపై అమానుషహింసాకాండ ప్రత్యక్షంగా జరుపుతున్న విషయాన్ని అమెరికా ఖండిస్తుందని ఎవరైనా తలచివుంటే అదే భ్రమే అని రుజువైందిగదా!

ఈవిధంగా ఏ విషయములో చూచినప్పటికీ అమెరికా అభ్యుదయనిరోధకవిధానం అవలంబిస్తోందని స్పష్టపడుతోంది. మానవజాతిపురోగమనానికి అడ్డుతగులుతోందని ప్రత్యక్షంగా కనబడుతోంది. అమెరికాపర్యటనలో నెహ్రూ ప్రపంచశాంతిని వాంఛించే ప్రతిరాజ్యము" సామ్రాజ్యవాదం, ఆర్థికఅసమానత్వమూ, జాతివిచక్షణావిధానం" రూపుమాపాలని అనేకసార్లు స్పష్టపరిచాడు. ఈవిషయాల్ని రూపుమాపటాన్కి అమెరికా ఇంతవరకూ ఏవిధమైన చర్య తీసుకోకపోవుటమే కాక ఇప్పుడు మరింత తీవ్రంగా అమలుజరుపుతున్నది. ప్రపంచపురోగతిని గుర్తించి మానవుడు చిరకాలంనుండి వాంఛిస్తున్న శాంతిసౌఖ్యాలకోసం అమెరికా హృదయపూర్వకంగా కృషిచెయ్యాలి. కాక ఇలాంటి సంకుచితదృక్పథముతోనే తన విధానాన్ని కొనసాగించదలచుకొంటే, శీఘ్రమే తన పతనంకూడ తథ్యమని అది గుర్తెరగటము, అవసరము.

———





లింకన్ జన్మించిన కొయ్యదుం

# బానిసవ్యాపారాన్ని నిర్మూలించిన మహాపు



అధ్యక్షపదవిని స్వీకరించటానికి తన స్వగ్రామంనుంచి వాషింగ్టన్‌కుచేరుతున్న లింకన్



లింకన్ జన్మించే నాటికి 1500 మంది ప్రజానీకమైనా లేని సిన్సి
ప్రధానమైన పడవల రేవుగానూ 160 వేల జనా





1851 లింకన్ ప్రథమ దఫా అధ్యక్షపదవి స్వీకరించిన తరుణంలో వాషింగ్టన్‌లోని ప్రభుత్వభవన గోపురం నిర్మించబడుతూ వుంది.





లకుటీరం

## రుషుడు-అబ్రహాం లింకన్



తి నగరం. ఆయన అధ్యక్షపదవికి వచ్చేటప్పటికి
గల నగరంగానూ పెరిగింది.



అమెరికాఅధ్యక్ష పదవికి పోటీ చేస్తూ ఇల్లినాయిస్‌లో ప్రసంగిస్తున్న లింకన్








# తేనెటీగలరాజ్యం

మార్గరేట్ గాటీ

తేనెటీగ తెల్లవారగట్టే నిద్రలేచింది. చైత్రమాసం అవటంవల్ల చెట్లన్నీ పువ్వులతో, పూతలతో, పొద్దున్న సూర్యుడి పచ్చటికాంతుల్లో, మిలమిలలాడుతూ, చల్లగాలిలో చక్కగా కదుల్తూ, అందచందాలు ఒలకబోసుకొంటున్నాయి.

తేనెటీగ పసిపాప కాదు. పెద్దదైంది. రోజూ పాటలుపాడుతునే శ్రమపడి తేనెపోగుచేసుకొని తేనెతుట్టెకు తిరిగిపోయేది. తేనెటీగ సంతోషంతో కొమ్మకొమ్మకూ, పువ్వుపువ్వుకూ, మొగ్గమొగ్గకూ గంతులు వేస్తూ, పువ్వులలో ఉన్న తేనెనంతా కొల్లగొట్టూ, తన తొడలకు కట్టిఉన్న సంచుల్లో నింపుకొంటూ, ఆడుతూపాడుతూ, తోటలన్నీ హాయిగా తిరుగుతూంది.

అంతకంతకీ పొద్దెక్కి భోజనాల వేళదగ్గిరకొచ్చి బడిలో పిల్లలు ఇళ్ళకు వచ్చేవేళ అయింది. పిల్లలంతా ఆ తోటల్లోనుంచి పరుగులెత్తుతూ, పువ్వులు కోసుకొంటూ ఇళ్ళకు సాగిపోతున్నారు.

ఒకపిల్ల చేతిలో చిన్నమిఠాయి ఉండ తింటూపోతూంటే, తేనెటీగ ఆ మిఠాయిఉండమీద వాలింది. ఇంతలో ఇంకోపిల్లవాడు గబాలున తేనెటీగను చేయివిసురుతో గుప్పిటతో పట్టేశాడు. తేనెటీగకు ఒక్కసారిగా తలదిమ్మెత్తినట్టయి ఒళ్ళు తెలియకుండా పిల్లవాడి చేతిలో పడిపోయింది. తేనెటీగకు తెలివివచ్చేటప్పటికి ఆ పిల్లలిద్దరూ, తేనెటీగను పరీక్షిస్తూ కబుర్లు చెప్పుకొంటున్నారు. ఆ పిల్ల అంటూంది.

“అన్నయ్యా! ఇది కూలీతేనెటీగ కాదూ, చక్కగా రోజంతా పని చేస్తుందట. చూడు, ఆ కాళ్ళదగ్గిర తేనె పుప్పొడిసంచులు ఉన్నాయి. అవి పనిచేసే తేనెటీగలకే ఉంటాయని మాష్టారు చెప్పారు” అంది.

“ఔను ఈ కూలిఈగ కేవలం తేనె, పుప్పొడి మోసుకెళ్ళటమే కాదు. తేనెతుట్టఅంతా ఈ కూలి ఈగలే కడ్తాయి. ఈ కూలిఈగ రోజంతా పనిచేయాలికదా పాపం.” అన్నాడు ఆ అన్నయ్య.

“ఏం పాపం ఎందుకు? పనిచేస్తే పాపమా”

“కాదు, తమకోసం కాకుండా ఇతరులకోసం కూలిపని చెయ్యవలసిన వాళ్ళకంటే దురదృష్టవంతులుండరని మామయ్య చెప్పలా! ఈ తేనెటీగలలో రాణిఈగఉంటుందట. అది ఊర్కే తేనెపట్టుమధ్య కదలకుండా కూర్చుని, “అల్లా చెయ్యి ఇల్లా చెయ్యి, ఇదిల్లా తీసుకెళ్లు! అది ఇల్లా తీసుకురా, అంటూ అందరిమీదా అధికారం చెలా

యిస్తూ మిడిసిపడిపోతూంటుంది. అదేకాకుండా, పోతుటీగ లని మరి కొన్ని సోమరిపోతు-ఈగ లుంటాయి. అవి పనీపాటా లేకుండా, వీళ్లంతా తెచ్చిపెట్టిన తేనె తింటూ బడుద్ధాయిల్లాగా తిరుగుతూంటాయి. పాపం ఈపనిచేసే తేనెటీగలే, ఈ మూడు రకాలవారికీ ఆహారం సంపాదించి పెట్టి, ఇల్లు కట్టిపెట్టి పనిఅంతా చెయ్యాలి పాపం" అన్నాడు అన్నయ్య.

"అయ్యోపాపం!" వీట్లకు మరి ఇల్లా బ్రతుకుతున్నామే అని తెలియదు కదా! అన్నయ్యా ఈ తేనెటీగకు కొద్దిగా మిరాయి పెట్టి వదిలేద్దాం."

ఆ అబ్బాయి నవ్వుతూ "మనం పెట్టక్కరలేదు. చూడు రెక్కలు విదుల్చుకొంటూ అదే తిని ఎగిరిపోతోంది" అన్నాడు. ఆ పిల్లలు కేరింతాలు కొట్టుకొంటూ ఇళ్లకు వెళ్లిపోయారు.

తేనెటీగకు పొద్దుణ్ణుంచి ఉన్న ఆనందంఅంతా తుడిచిపెట్టుకొనిపోయినట్టయింది.

"ఛీ పాడు బ్రతుకు! నేను రోజంతా కష్టపడి కూలిపనిలాగా తేనెకూర్చటమేమిటి? రాణియీగ, సోమరిపోతుటీగలూ కూర్చుని తింటూ నామీద అధికారం చలాయించట మేమిటి"- అనుకొని రొమ్ము విరుచుకొని "ఉహూ! తెలిసివచ్చింది. ఇక ఇల్లా ఉండటం పనికిరాదు- పని చేసే ఈగలకే అధికారం ఉండాలని మావాళ్లందరితో చెప్పి ఈ ఊడిగం వదిలిస్తా" అనుకొంటూ, మొగమూ, రెక్కలూ, అన్నీ కందగడ్డలాగా ఎఱ్ఱజేసుకొని కోపంతో, విసురుగా ఇంటికి వస్తోంది.



మధ్యమధ్య చీరాకు ఆపుగోలేక, "ఛీ, ప్రపంచంలో నాకంటే కనా కష్టపు జీవు లుండరు" అంటూంది.

దోవలో ఎదురు తగిలిన ఒక ముసలి తేనెటీగ, ఈ పడుచు ఈగ తనలో గట్టిగా ఇలా అనుకొంటూంటే విన్నది. విని ఆదరంగా అడిగింది.

"ఏం నాయనా! ఏం వచ్చిందిపాపం! అంత నికృష్టపుపని ఏంచేశావేమిటి, అల్లావిచారిస్తున్నావు?"

పడుచుఈగ చిరాకుతోనే "ఏం చెప్పేది తాతా! ఇవాళనే నేనెంతో తిరిగాను. నన్నుగురించే నేను చాల కొత్తకొత్త విషయాలు వినివచ్చాను. మనము వట్టిఅధ్వాన్నపు బతుకులు బతుకుతూ ఉన్నామని నాకు తెలిసి వచ్చింది."

"ఇన్నాళ్ళు, హాయిగా బ్రతుకుతున్నాననుకొని, నీ స్వానుభవంవల్ల నువ్వు అనుకొంటూ వచ్చావుకదా, ఇన్నాళ్ళటి అనుభవమూ కాదని, ఇట్టే నీకు తెలియచెప్పిన జంతు వేది నాయనా!" అంటూ తాతయీగ వేళాకోళం చేస్తూ నవ్వుగా నొక్కుతూ అంది.

"అది కాదులే తాతా! వాళ్టికి ఒక నిజం తెలుసుకోగలిగాను. ఎవళ్లు నేర్పారని ప్రశ్నెందుకు?" అంటూ పడుచుఈగ ముగం చింకుకొంది.

"నిజమేలే! విషయం ముఖ్యం గాని ఎవరు చెప్పారా అని కాదనుకో! అయినా అది కాదు! ఇవాళ్టిదాకా చాలా సుఖంగా బ్రతుకుతున్నానని అనుకొంటున్న దానివి, ఇప్పుడు ఎవళ్ళో ఏదో చెప్పారని, ఛీ! ఛీ! ఇన్నాళ్ళూ వెధవబ్రతుకు బ్రతుకుతున్నానని ఇట్టే ఎల్లా అనుకోగలుగుతున్నా

వంటా అని సాగదీస్తూ అడిగింది ముసలిఈగ.

పడుచు తేనెటీగకు కోపం వచ్చింది.? "చాల్లెద్దూ మీ ముసలి వాళ్లంతా ఇంతే. అయినా నీతోటి మాట్లాడటమే తప్పు" అనుకొంటూ తన ఈడువాళ్లకు ఈ కొత్త విషయం బోధచేయాలని వెళ్లి పోయింది. వెళ్లి వాళ్లను కలుసుకొని ఒక మీటింగు పెట్టింది.

పడుచు తేనెటీగలన్నీ కూడా, ఈ తేనెటీగ చెప్పిన మాట విన్నాయి. "ఔను నిజమే. మన మంతా పనిచేయటమేమిటి, ఎవత్తో ఒక్కతె రాణీఅంటూ కులుకుతూ కూర్చోటం ఏమిటి ? అందరం రాణీలమే అవాలి. అంతే, ఇకనుంచీ ఒకళ్లు అధికారంచేయటం ఒకళ్లు పడటం, ఉండకూడదు" అంటూ మరికొన్ని తేనెటీగలు ఝుమ్మని రొదచేస్తూ అరవసాగాయి.

అక్కడినుంచి తేనెటీగలన్నీ కలిసి తమ రాజ్య మెల్లా ఉండాలో తమకు స్వాతంత్ర్య మెల్లా ఉండాలో ఆలోచించేందుకు సమావేశాలు జరుపసాగాయి. "అందరం రాణులం కావాలి"అంటూ నినాదం లేవదీశాయి.

పనిచేసుకొంటూన్న ముసలి యీగ, ఒక్కసారి ఇటు వాళ్ల పక్కకు తిరిగి, "పనిచేసేవాళ్లు లేక పోయాక అందరూ రాణులయి మాత్రం ఏం సౌఖ్యమబ్బా" అంటూ గొణిగింది.

పడుచుఈగలన్నీ కోపంతో "ఝుమ్మ" ని ఒక్కసారి రొద చేశాయి. ముసలిఈగ మాట్లాడకుండా తలతిప్పుకొంది.

కాని ఒకపడుచుఈగకు ముసలి యీగచెప్పిన సందేహమే మనస్సుకు పట్టుకొంది.

మరి అయితే అందరమూ రాణులమే అయితే, తేనె తెచ్చేదెవరూ, తేనె తెట్టుకట్టేదెవరూ పిల్లయీగలను పెంచేదెవరు? పోనీ అసలు రాణులే లేకుండా, అందరం పనిచేసే ఈగలంగానే ఉంటే" అని అడిగింది.

ముసలిఈగ మళ్ళీఅందుకొంది. అయితే ఇంక ఇప్పటికి అప్పటికి భేద మేమిటి?" అని అడిగింది.

పడుచుఈగలకు మరీ కోపము వచ్చింది. నిన్నెవళ్ళూ అడగలేదు. మాట్లాడకు ఊర్కో" మన్నాయి. కాని వీట్లకుకూడా ఏమీ తేలటం లేదు. ఇంతలో బాగా చీకటి పడి పోయింది. వాట్లకు బాగా నిద్రపట్టి పోయింది. ఆరోజుకి అల్లాగే పడుకొన్నాయి.

(సశేషము)

# చాకలి-దేవుడు

**శ్రీ వల్లపూడి గోపాలకృష్ణయ్య**

తుమ్మలపూడను కమ్మపాలెమున
గమ్మత్తొక్కటి జరిగింది-
అప్పన్న నే చాకలి తిప్పడు
కప్పల చెఱువుకి వెళ్లాడు-
చద్దన్నం పది ముద్ద లయ్యేతే
ఒద్దనకుండా మింగాడు-
చుట్ట గట్టిగా చుట్టి గట్టుపై
నిప్పు లేక కూర్చున్నాడు-
కూర్చుని కూర్చుని నిప్పు దొరకక
ఏదో సణుగుతు లేచాడు-
నోటిలొ చుట్టను కొఱికి కొంచెము
తాటిమట్టలో పెట్టాడు-
కానిమ్మనుకుని మూటను విప్పి
బట్ట లుతుక మొద లెట్టాడు-
రామ రామ అని రాతిబండపై
బట్ట లుతుకుతూ వుండంగా-
ఒక్కసారిగా నాల్గు దిక్కులూ
పిక్కటిల్లి నావీ-
అప్పుడు దేవుడు అప్పన్నకురా
గప్పున కనిపిం చన్నాడు-
ఎందుకు పిల్చావ్ చాకలితిప్పా
ఏం గావా లని అన్నాడు
ఆ మాటలు విని చాకలితిప్పడు
ఫక్కున నవ్వేటు లన్నాడు-
డాకేటరు-మా-భార్యాగారిది
జాకిటు వుతుకుతు వుండంగా-
ఎణ్ణి యెంగలావి కాపోతే
యేం గావా లని అంటావా?-
ఆ మాటలు విని రాముడు నవ్వుతూ
అంతర్థానం అయ్యాడు-
చాకలి తిప్పడు సగం బట్టలను
ఉతికీ ఒడ్డున కెక్కాడు-
మట్టలొ పెట్టిన చుట్టను సూసి
వేలు కసిక్కన కొఱికాడు-
ఇందా కొచ్చిన రాములోరినీ
నిప్పు రవ్వైనా అడిగానా!-
పాడుజల్మం అంటూ ఆడనె
ఇట్టే చతికిల బడ్డాడు-

బాలానందం:

# తాన్‌సేన్ గర్వం

**శ్రీమతి సామవేదం అన్నపూర్ణ**

**పూ**ర్వం మనదేశాన్ని అక్బరుచక్రవర్తి పరిపాలించే కాలంలో అతని ఆస్థానంలో తాన్‌సేన్ అనే గొప్పసంగీతవిద్వాంసు డుండేవాడు. తాన్‌సేన్ గొప్పవిద్వాంసుడే గాని అతనిలో ఒక చెడ్డగుణం గూడా ఉంది. తాన్‌సేన్ ఎప్పుడూ సంగీతానికి తానే సర్వాధికారనీ, తనకంటే బాగా పాడేవాళ్ళు లేరనీ అనుకుంటూ ఉండేవాడు. అక్బరుచక్రవర్తి కూడా తాన్‌సేన్‌ని అమితంగా గౌరవిస్తూ ఉండేవాడు. ఒకరోజున అక్బరుచక్రవర్తి తాన్‌సేన్‌తో సరిసమానంగా సంగీతం పాడగలవా రెవరైనా ఉంటే వచ్చి పాడవలసిం దని కోరాడు. కాని ఎవరూ ముందుకువచ్చి “నేను పాడతాను” అని ధైర్యంగా చెప్పలేకపోయారు. దీంతో తాన్‌సేన్‌కి మరీ గర్వం హెచ్చిపోయింది. తాన్‌సేన్, తన మందిరం చుట్టుపట్ల ఎవరూ కూడా సంగీతం పాడకూడదనీ, అల్లా పాడినవాళ్ళని తనతో పోటీకి వచ్చినట్లుగా భావించుకొని ఓడిపోయిన వారికి యావజ్జీవ కారాగారవాస శిక్ష విధిస్తా నని చాటించాడు. అక్బరుకూడా ఈ మాటని కాదనలేక పోయాడు. ఈ చాటింపు విన్న తర్వాత ఎవ్వరూ కూడా తానెసేన్ మందిరానికి మైలుచుట్టుపట్లలో సంగీతము పాడడానికి తెగించేవారు కారు.

ఇది ఇల్లా ఉండగా ఒక నాడు కొంతమంది బాటసారులు ఆదారిని పోతున్నారు. వారిలో ఒక బీద బ్రాహ్మణకుటుంబంవాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళది పొరుగూరవటం చేత ఈ చాటింపుసంగతి వాళ్ళెరుగక కూనిరాగాలు తీయటం మొదలు పెట్టారు. ఈ రాగాలు తాన్‌సేన్ చెవిని బడ్డయ్. అంతే!



ఇంకేముంది తాన్‌సేన్ భటులని పంపించి వాళ్ళని బలవంతంగా ఆస్థానానికి రప్పించాడు. అందులో భార్యా, భర్తా, ఇద్దరు కొడుకులూ ఉన్నారు. వాళ్ళు మాకు తెలియక పాడాము మొఱ్ఱో మని మొత్తుకున్నారు. కాని ఏం లాభం తాన్‌సేన్ పంతం నెగ్గవలసిందే. వాళ్ళలో చిన్నకొడుకు చాలా చిన్నవాడవటం చేత అతన్ని వదిలివేసి మిగిలినవారికి యావజ్జీవకారాగారవాస శిక్ష విధించారు. దీంతో తాన్‌సేన్ తన పంతంనెరవేరింది గదా అని అపరిమితంగా సంతోషించాడు.

తాన్‌సేన్ వదలివేసిన పిల్లవాడికి అపరిమితంగా విచారం కలిగింది. పోనితన్ని గూడా తలిదండ్రులతో బాటు జైల్లో ఉంచినా బాగుండు ననుకొన్నాడు. కాని వాళ్ళు అలా చెయ్యలేదు. ఇది తలచుకొంటే అతనికి చాలా దుఃఖం వచ్చింది. కాని ఏం చెయ్యగలడు! తనకేమో పూర్తిగా పదిసంవత్సరాలైనా నిండలేదు. ఏమైనా సరే తాన్‌సేన్‌మీద పగ తీర్చుకోవాలనుకున్నాడు. తాన్‌సేన్‌మీద పగ తీర్చుకోవాలంటే అతణ్ణి ఓడించాలి. ఎంత కష్టం! అయినా సరే అతను కష్టమని ఎంచక సంగీతం నేర్చుకోనేందుకు కాశీకి ప్రయాణం కట్టాడు. ఈ సంగతి తెలిసిన పౌరులు అనేకమంది అతన్ని నిరుత్సాహపరచారు. కాని అతడు కొంచమైన చలించకుండా నిద్రాహారాలు మాని నడిచి కాశీ చేరుకున్నాడు. కాశీకైతే వచ్చాడు కాని సంగీతం ఎవరు

(33-వ పేజీ చూడుడు)

## "పేదకుదొరికిన పెన్నిధి"

(15 వ-పేజీ తరువాయి)

దిగేరు. ఆ బండే కుదుర్చుకొని అలసటతో కూర్చున్నాడు. బండిలో చాల చీకటిగా వుంది. కడుపు దహించుకుపోతూంది.

బండి మలుపు తిరగటంతో, కొంచెం కుదిపి మైకేల్ని వూపింది. మైకేల్ ఆపుకోడానికి చేతులు చాచి తన సీటు చివర భాగాన్ని పట్టుకోవలసివచ్చింది. చేతులకేదో తగిలింది. దానిని తీసి జిజ్ఞాసచే కిటికీ దగ్గరపెట్టి చూశాడు. ఎర్రతోలుతో చేయబడిన సంచి. తాళంవేయబడివుంది. యిదివరకు దిగిన పెద్దమనుష్యులదై వుంటుందని వూహించి, బండివానిని తిరిగి స్టేషనుకు బండిని త్రిప్పమని చెప్దామా, అనుకున్నాడు. కాని వారిని కలుసుకోవడం అసంభవమైన పని; తన కర్తవ్యం ఆ సంచిని పోలీసులకు వప్పగించడమే.

"అందులో ఏమున్నదో అన్న జిజ్ఞాస ఎక్కువైపోయింది. తాళం లాగాడు. కాని రాలేదది. అది తాళంవెయ్యబడకుండా వుంటే ఆ నిమిషానికే అతని జీవితంలో ఎంతో విశేషమార్పు వచ్చియుండేడిది.

మెదడంతా ఆలోచనలతో నిండిపోయింది ఒకదాన్ని మరొకటి ఓడించేస్తూంది. యించుమించు స్వప్నలోకంలో విహరిస్తున్నట్లున్నాడు. రాత్రిభోజనం ముందుచేసి, తరువాత ఏపనినైనా చెయ్యాలని, బండి హోటల్కి త్రిప్పమన్నాడు. బండికిరాయి చెల్లించి, హోటల్లోకి చురుగ్గా ప్రవేశించి ముందుగా ఒక పాయిఖానాలో ప్రవేశించి, ఆ విద్యుద్దీపకాంతి వెలుగున, అతనిజేబులో వున్న చిన్న చాకుతో, ఒకపావుగంట తింటాలుపడి సంచిని తెరవగలిగాడు. సంచిలోపల చూడగనే అతని రక్తప్రసరణ ఎక్కువయింది. గుండెలు విపరీతవేగంతో కొట్టుకుంటున్నాయి. ఒక పౌనునోట్లకట్టలు ఎనిమిదున్నాయి. అన్నీ సరికొత్తవి. ఒకొక్కకట్టలో 250 పౌనులున్నాయని పైన గుర్తింపబడివుంది. సూక్ష్మంగా చెప్పాలంటే ఒక్కసారిగా, ఆసమయంలో రెండు వేల పౌనుల కధికారన్నమాట.

జీవితంలో దెబ్బలు తినిన తను...భార్య, బిడ్డ...అన్నంలేక మాడటం,...నిరుద్యోగం...రెండువేల పౌనులు...నిజంగా అసమయంలో తన జీవికతుల, రెండవవేపునే బరువు సూచిస్తూంది. ఆ నోట్లలో పదిహేడు పైకి తీసి తన నోట్పుస్తకంలో వుంచాడు. మిగిలినవి తాను ధరించిన కోటుజేబుల్లో సర్దేడు. తోలుసంచికూడా ఒకదాంట్లో కుక్కేడు.

హోటల్లోపలికి వెళ్లి ఖరీదైన బ్రాందీ సోడా తెమ్మని హుకుమ్ చేశాడు. అవి త్రాగి బయటపడ్డాడు. ఒక బండి కుదిర్చేడు. యింటికి పోయేమార్గంలో సారా బుడ్లు, చాకలెట్పాకెట్లు కొన్నాడు. యింతవరకు అతని మనోభావాల్ని ఏ అంతశ్శక్తి అణిచివుంచిందోగాని, యింటి పరిసరప్రాంతాలకు వచ్చేసరికి తన భార్యా, తానుచేసినపనీ స్మృతికి వచ్చాయి.

"దొంగతనం పచ్చిదొంగతనం" కాని యింకొకరుమాత్రం ఆసమయంలో ఏమిచేసియుండేడివారు! అతనిని భయపెట్టేదేమీ లేదు. కాని ఒక్కటి...... అతని భార్య యొక్క, కాంతులను వెదజల్లే నేత్రాలు. యీవిషయం అతని భార్యకు ఎంతమాత్రం తెలియకూడదు. సంచిని వదల్చుకోవాలి, నోట్లను దాచెయ్యాలి. అప్పుడప్పుడు అవసరాన్నిబట్టి తియ్యాలి. ఏదో పనిచేసి గడించినట్లు నటించాలి. కాని సంచిని వదల్చుకోవటం ఎట్లా? బండిలో వదిలేస్తే...సమయంవస్తే బండివాడు తప్పక సాక్ష్యంయిస్తాడు. యీ విషయం ఆలోచిస్తేనేగానియింటికి పోవద్దనుకున్నాడు. బండిదిగి వానిని పంపించి నడవటం ప్రారంభించాడు. మధ్యత్రోవలో ఒక కాల్వవుంది. దానిపైన వంతెనుంది. చురుగ్గా నడుస్తున్నాడు వంతెనమీద మైకేల్. అతనిలో యిదివరకున్న శ్రమ లేదు. ఒక రాయి కట్టి సంచిని కాల్వలో పారేద్దామనుకున్నాడు కాని అక్కడ రాళ్ళు లేవు. వూరికే పారేస్తే మునిగిపోదూ? కాని ములక్కపోతేమాత్రం! యీవిషయం గురించి ఎవరంతపట్టించుకోనేవారు. అదే మాసిపోతుందనుకున్నాడు.

ఒంతెనమీద ఒకరిద్దరు నడుస్తున్నారు. అందరూ పోయేవరకూ, వేచివుండాలి. సంచి చేతులోకి తీసుకున్నాడు. ఒకసారి ఎవరికీ, అనుమానం కలగకుండా వంతెన చివరవరకు నడిచేడు. అందరూ దృష్టిపథాన్నుండిపోయాక తిరిగివచ్చేడు మైకేల్. యిప్పుడు పారేస్తే......అహ(...అందుకూ వీలుపడలేదు. ఎవరో వస్తూన్నట్లున్నారు... పోలిసేమో...'ఆవంతెనమీద ఏంచేస్తున్నా'వని అడిగితే; వంతెన మరీ బయలు ప్రదేశం అయిపోయింది. చీకటి ఆవరించుకొన్న ఒక సందులోకి మళ్లేడు మైకేల్. ఒకపిట్టగోడ, దానివెనుకభాగాన్ని చిన్నతోట వుంది. ఆమార్గంలో ఒక్క వ్యక్తికూడా కానరాలేదు. మెరపులా గోడవతలికి విసిరేసేడు సంచిని. మైకేల్ కాని ఆతోటలో మేడమీద విద్యుద్దీపకాంతులలో ఒకవ్యక్తి యితనివైపే దృష్టినిగిడించి చూస్తున్నాడు.

"ఎలాగైతేం, వదిలిపోయిందిగదా!" అని సంతోషపడ్డాడు. ఒక బాధవదిలింది. రెండవది ఆనోట్లు దాచడం ఎలాగ...... జేబులు యితరులకు అనుమానాన్ని రేకెత్తిస్తూ ఎత్తుగా వున్నాయి. యింటికి పోగానే ఎలియనార్ తప్పక వచ్చి కౌగలించుకుంటుంది. "మీరేం తెచ్చారు" అనే పరిచయవాక్యాలు అతని చెవుల్లో రింగుమంటున్నాయి. ఏవస్తువునైనా ఎలియనార్కి తెలియకుండా దాచటం బహుకష్టమైన పని. అతనికి సంబంధించిన ప్రతివస్తువును ఎలియనార్ ఎంతో శ్రద్ధతో చూస్తుంది. యింట్లో ఏపెట్టెకూ తాళం లేదు. యీబాధ అంతా మైకేల్, తన ప్రవర్తనకు ఆమెచే కళంకం ఆపాదింపబడేటట్లు లేకుండా పడుతున్నాడు. "ఈ నోట్లు ఎక్కడైనా దాచి యింటికి పోనా" అనుకున్నాడు. "వెర్రిపన్లు చెయ్యకు, నీకే గాకుండా నీభార్యా బిడ్డకు సౌఖ్యం చేకూరబోతుంటే ఆహ్వానించక, నిరాకరించేవ్యక్తివి నీ వొక్కడవు కనిపించావు" అని ఘోషించిందాత్మ. ఎలాగైతేనేం యిల్లు చేరుకున్నాడు.

"అదుగో, ప్రియతములు దయచేశారే, సుఖంగా వున్నట్లేనా" అని ప్రేమపూర్వకంగా ఎలియనార్ ప్రశ్నించింది:

ఓహో, అంతా సుముఖంగానే నడిచింది. ఈలోపున యానీ ఏడవటంవూలాన ఆమెను జోకొట్టిరాడానికి ఎలియనార్ లోపలికి వెళ్లింది. "సమయం దొరికింది గదా"అని మైకేల్ నోట్లకట్టలను ఒకపొట్లం క్రింద కట్టి అలమారులో పెట్టేడు. "యీ రాత్రికి యింతకన్న నేనేమీ చెయ్యదల్చుకోలేదు. చెయ్యలేను" అని సమాధానపడ్డాడు. ఎలియనార్ వచ్చినతరువాత "చాలా అలిసిపోయాన"ని చెప్పి భయముచే బిడ్డనీ, తల్లినీ కౌగలించుకున్నట్లుగా, యిన్ని

దినాల వియోగంచేత మైకేల్ ఆమెను ఆలింగనం చేసుకున్నాడు.

ఆమె ప్రశాంతంగా నిద్రపోయినతరువాతగాని తోలుసంచికి సంబంధించిన ఆలోచనలు అతనికి రాలేదు. అతనుగనక పట్టుబడితే, ఆమె తప్పక గుండెపగిలి చనిపోతుంది. "ధనానికి సంబంధించిన కష్టములు నాకు లెఖలేదు. మరేవిధమైనవి చుట్టుముట్టకుండా వుండాలన్న" ఆమె వాక్యాలు అతనికి జ్ఞాపకం వచ్చేయి.

అతను చేసినపని ముమ్మాటికి అన్యాయం. పచ్చిదొంగతనం, పట్టుబడితే అరెస్టు, విచారణ, ఖైదు, తప్పవు. యిదివరకు ఎన్నడూ ఎవ్వరికి అన్యాయం చెయ్యలేదు. ఎవరి దృష్టిలోనూ, నేరస్థునివలె వుండలేదు. "ఈ సంగతి యలియనార్‌కి తెలిస్తే," ఆమె యింక ఎంతమాత్రము యిదివరకువలె ప్రేమింపలేదు. ఆమెజీవితము భ్రష్టవుతుంది. చిన్నబిడ్డభావిజీవితం మంట కలుస్తుంది.

రెండవ గదిలోకి వెళ్లి నోట్లు తగలబెట్టేస్తే! "అమ్మో, కాల్చెయ్యడమే. ఎలియనార్‌కి గాఢనిద్ర పట్టను. బాలిక, కదిల్తే చాలు లేస్తుంది తాను లేచి అంత ప్రయత్నం చేస్తూంటే లేవదూ? తప్పక మేల్కొంటుంది. యింతకూ తోలుసంచి విసిరేసేడుగద. తిరిగి వట్టినోట్లకట్టలిస్తే, అతను సంజాయిషీ యివ్వవలసిన విషయాలు చాలా వున్నాయి. "వెర్రివాడా, అంత సొమ్ము నీదగ్గర వుందా? నీవు. అందులో కొంతభాగం ఖర్చుచేయలేదూ?"అని ఆత్మ ఘట్టిగా ప్రశ్నించింది. "బహుశా ఆ ధనం ఒక పెద్ద కంపెనీకి చెందివుంటుంది. బీదవాళ్ల కూటిలో మన్నుకొట్టలేదుకద." ఆ సంగతి అతని మనసుకు శాంతినే చేకూర్చింది. కాని నిద్రపట్టక దొర్లుతున్నాడు మైకేల్ యీ ఆలోచనలతో. సొమ్ము అతనిదగ్గర వుంచితే, ఏవో మాయకబుర్లు చెప్పాలి. ఏదో పెద్దవుద్యోగం దొరికిందంటే; అహం. ఆ విషయం ఎలియనార్ నమ్మదు. అతనివద్ద ఏ వుద్యోగానికి సమర్థత వుందో ఎలియనార్‌కి తెలుసు. పినతండ్రి యిచ్చేడంటే... ఆ విషయంకూడా ఒకానొకప్పుడు ప్రమాదంచేదే; ఎలియనార్, పినతండ్రికి వ్రాసి కనుక్కొందామన్న యిచ్ఛ కలిగి వ్రాస్తే, అతడు వ్యతిరేకసమాధానం యిస్తే, తన మాటలు నూటికి నూరుపాళ్లూ అసత్యమని తేలుతుంది.

"ఈ ఆలోచనలన్నీ ఎందుకు, ఖర్మ ఎలా వ్రాసివుంటే ఆ విధంగా అవక మానదు"అని నిద్రపోయాడు మైకేల్. "చాలా అలిసిపోయినట్లున్నారు. యింత ప్రొద్దుపోయినా లేవటంలేదు" అన్న ఎలియనార్ స్వగతంవల్ల అతనికి మెలుకువ వచ్చింది. కాలకృత్యాలన్నీ తీర్చుకుంటున్నాడేగాని, నోట్లవిషయమైన ఆలోచనలతో మెదడు కందిపోతూంది. నోట్లకట్ట బీరువాలోనుంచి తీసుకొని లైబ్రరీకని పోదామనుకున్నాడేగాని, ఎలియనార్ ఎప్పుడూ కూడానే వుంటూంది. కడకు వెళ్లిపోయేటప్పుడు కూడా "త్వరగా వస్తారుగదూ"అంటూ గుమ్మందాకా వచ్చింది.

ఎలియనార్ ఒక గొప్పవాణ్ణి వివాహమాడివుంటే, ఆమె సౌందర్యం, తెలివితేటలు, జాగ్రత్త, ఎంతైనా సార్థకములోనికి వచ్చును.దగ్గరగా వున్న పేపర్ల దుకాణానికి పోయి ఒక పత్రిక కొన్నాడు మైకేల్. అందులో సంచికి సంబంధించిన వార్తలేమీ లేవు. ఏమో, యీ పత్రికలో ఆ వార్త వెయ్యడానికి టైము లేదేమో!" అనుకున్నాడు. యింతలో మరియొక పత్రిక వస్తే కొన్నాడు. అందులో మొదటి పేజీలోనే పెద్దఅక్షరములతో "బండిలో 2000/- పౌనులు వదలివేయబడెను" అన్న వార్త వుండెను. ఒక బ్యాంకిషరాఫ్, సర్ జేమ్సు కుస్పింగ్ కె. బి. యి. అను వతనిచే మరచిపోబడెనట. బ్యాంకికి సంబంధించిన సొమ్మట. ఆ సంగతి విశదపర్చినవారికి బహుమానముకూడ యిత్తురట.

ఇంతవరకు వచ్చిన వార్తలు తృప్తికరంగానే వున్నాయి. కుస్పింగ్ లక్షాధికారి. తన అజాగ్రత్తకు బ్యాంకువారు సొమ్ము వసూలుచేయ నిశ్చయించినను యియ్యగల సమర్థుడు. బ్యాంకి దీనివలన పెద్దనష్టానికి లోబడుతుందా, అంటే కోట్లమీద వ్యాపారంచేస్తూన్న సంస్థ. రెండు పెన్నీలెంత విలువ మైకేల్ దృష్టిలోవుందో, బ్యాంకుకు రెండువేల పౌనులంత విలువ. అయిపోయిందేదో అయిపోయింది. దాని కోసం యింత, తలబ్రద్దలు చేసుకోవడం ఎందుకు మైకేల్.

మైకేల్ తిరిగి యింటికి వచ్చేడు: అప్పుడే ఎలియనార్, అలమారులో నోట్ల పొట్లం చూసింది. "ఈ పొట్లం ఏమిటి" అంటూ ప్రశ్నించింది మైకేల్ని.

ఓ...అదా...అవును...నాది.. కాదు. ఎవరిదో యితరులది.

ఎలియనార్ మైకేల్‌లమధ్య రహస్యాలింతవరకు లేవు. "నేను యీ పొట్లం విప్పలేదులెండి"అని అమాయకంగా ఎలియనార్ అతని చేతిలో వుంచింది.

"అయ్యో దీనిసంగతి మర్చేపోయాను. వెంటనే యిచ్చిరావాలి అని కోటు తీసుకొని, పొట్లం చేత్తోపట్టుకొని వీధిలో అడుగుపెట్టేసరికి ముఖంఅంతా చెమటతో నిండిపోయింది. ఒక్క అరగంటలో ఒక మారుమూలసందులో ఒక యింటాయెదగ్గరకు వచ్చేడు మైకేల్.

"అమ్మా, యిక్కడ అద్దెకియ్యడానికి వీలుపడుతుందా; ఒక్కగదిమాత్రం కావాలి" అన్నాడు.

"ఓ తప్పక యిస్తాను" అంందామె.

"మరేమీ లేదు. నేను ఒక కవిని. నిశ్శబ్దంగా వ్రాసుకునేందుకు ఒక మంచి గది కోసం తిరుగుతున్నాను."

"నీకు సరిపడేగది యిస్తాను. రా"అంది. మైకేల్ గది మాశాడు. మురికితో, చీకటిగా వుంది.

"సరే, యీ దినమే వస్తాను"అన్నాడు మైకేల్.

"మీ పేరు?" అంది ముసలిది.

"నాపేరా.........జాక్ పార్సన్సు" అన్నాడు మైకేల్. బజారుకు పోయి గట్టి తాళం ఒకటి మంచి సొరుగుపెట్టె, కాగితాలు, కలము, సిరా మొదలగునవన్నీ కొని తీసుకువచ్చి వాటితోబాటు నోట్లకట్టలు కూడా అందులో పెట్టి తాళమువేసి తన గదికికూడ తాళం బిగించి తిరిగి వీధిలో పడ్డాడు. ఒక్కసారిగా స్వేచ్ఛ ననుభవించగల్గేడు. తనకు విసిరే గాలి అప్పుడు చల్లగా వుందని అనగలిగేడు.

మైకేల్ యింటికి వచ్చేడు. ఎలియనార్‌కి అనుమానం తోచకుండా, ఎవరో స్నేహితుడు ఆ పొట్లం ఒకరికి అందచేయవలసినదని

ప్రార్థించేడని, ఎలియనార్ తిరిగి యిచ్చే వరకు, తనకు ఆవిషయముజ్ఞాపకమే లేదని, తను యిచ్చివచ్చినందున భాధ్యత వదిలిందని కల్పితకథ చెప్పి ఆమెను నమ్మకం కలుగ చేశాడు.

ప్రతిదినం తన గదికి వచ్చి నోట్లు చూసు కొని కావలసినవి తీసుకొని తిరిగి వస్తు న్నాడు. ఎలియనార్తో తనకు క్రొత్త వుద్యోగం వచ్చిందని, వారానికి అయిదు పౌనుల జీతమని చెప్పేడు. ఎలియనార్ ఆనందం పట్టలేకపోయింది.

"యింతకూ నాయందు తప్ప "బిన్సు" కంపెనీవారికి నమ్మకం లేక యీ వుద్యోగం నా కిచ్చారు. పని చాలా తేలికనికూడా చెప్పాడు.

తన భార్య, బిడ్డ సుఖంగా బ్రతుకు తున్నారు. యింతకన్న మైకేల్కి కావల సిన దేముంది.

ఆర్థికంగా అతనిస్థితి బాగున్నా నైతి కంగా చాలా హీనుడైపోయాడు. నిరంతరం అసత్యం పల్కడం, అనుమానం, భార్య ముఖంలోకి చూడలేనంత పిరికితనం, ఆనం దంగా వుండవలసిన సమయాల్లోకూడా ఒక విధమైన భయం, బెరుగు అతన్ని తరుముతో వున్నట్టే వుంటాయి. ఆలోచనలతో మెదడు కందిపోయినపుడు ఒకసారి వీధిలోకిపోయి, సారాయిపట్టించి, ఆసంగతులు మరిచిపో ప్రయత్నిస్తాడు.

అతనిముఖంలో ఏవో విప్పి చెప్పజాలని విషాదరేఖలు ఎలియనార్ గుర్తించక పోలేదు. ఒకదినం "మీరు ఎక్కువ పని, పైన వేసుకుంటున్నారు. రోజురోజుకు ముఖం వాడిపోతూంది" అంది ఎలియనార్. సారా వేసినప్పుడు వలవల ఏడ్చేది. అప్ప డప్పుడు తను అద్దెకు తీసుకున్న గదిలో కూర్చుని ఏవో వ్రాసి ప్రచురణకు యిస్తూ వుండేవాడు. మిగిలిన కాలం అంతా, త్రాగుడు పేకాటలలో గడిపేసేవాడు.

ఎలియనార్ని తన ప్రేమకు దూరంగా చేస్తున్నాడు మైకేల్. ఆరు నెలల కాలంలో సుమారు అయిదు వందల పౌనులు ఖర్చుచేశాడు. యీ వరుసను ఖర్చుచేస్తే యిక పద్దెనిమిది మాసాలలో అంత సొమ్మూ ఖర్చయిపోతుంది. యింక మిగిలేదేమిటి... భ్రష్టయిన జీవితం గల తను... ఆరోగ్యం చెడిన భార్య... భావి జీవితము కూడా పాడవనున్న బిడ్డ.

ఒకదినం ఎలియనార్ అద్దంలో చూసి తల దువ్వుకుంటూంటే మైకేల్ చూశాడు. ఆమె ముసలిదైనదానివలె కనబడింది. అతని ముఖం మాసుకున్నాడు. రేగినజుట్టు, గుంటలు పడిన కళ్లు, లోపలికి పోయిన దవడలు... ఒక్కసారి అతనికి దుఃఖం పొర్లుకొచ్చింది. అతని ముఖం తలగడలో దూర్చేసు కున్నాడు. ఆలోచించి కృతనిశ్చయు డయ్యాడు. సగం తినడానికి కలిగి ఒక గుమాస్తాపనే తను చేయ సంకల్పించేడు. మిగిలిన సొమ్ము ఎవరు పంపేరో తెలియ కుండా, అసలువారికి అందజేదాం అను కున్నాడు. వీధిలోనికి పోయి తిరిగివచ్చుసరికి ఎలియనార్ ఒక టెలిగ్రాం యిచ్చింది. "వెంటనే రమ్మనమని". అతని పినతండ్రి దగ్గరనుండి వచ్చింది. ఏదో ముఖ్యావసరం వుంటేగాని తంతి నిచ్చే అవసరం వుండదు; వెళ్లమని ఎలియనార్ మైకేల్ని బలవంత పెట్టింది.

వెంటనే బయలుదేరాడు. పినతండ్రి యిల్లు చేరగానే "అతడు మైకేల్కొరకై ఏక, కలవరిస్తున్నాడని, చాల జబ్బుస్థితిలో వున్నాడని మైకేల్ వస్తేనేగాని ప్రాణం పోదటని దాసివల్ల విన్నాడు.

మైకేల్ పినతండ్రి జబ్బుతో ప్రక్క నంటిపెట్టుకున్నాడు. కళ్లలోని కాంతి తప్ప మరేమీ గుర్తింప సర్వత లేనట్లుగా వుంది.

అతని పరిస్థితి త్వరగా రమ్మని అతని సైగవల్ల, మైకేల్ అతనివద్దకి వెళ్లేడు.

అస్పష్టమైన ధ్వనితో "బాబా...... పార్శిలు........నీది..........యిరవై ఎనిమిది వేల పౌనులు నీవి...చెప్పలేను...నాకు... శలవు...అతన్ని నేనే...చంపేను.

"ఏమిటి మా తండ్రినా?" అన్నాడు మైకేల్. అవును, మీతల్లిని ప్రేమించాను...

"భగవంతుడు నన్ను క్షమించుగాక" అని ముసలివాడు చనిపోయాడు.

యిరవై ఎనిమిదివేల పౌనులతో మైకేల్ యింటికి వచ్చేడు.........

కాదు యిరవైఆరువేలే. తాను యింక భయపడనవసరంలేదు. యింటిదగ్గర ఒక కంపెనీయజమానిదగ్గరనుండి వచ్చిన వుత్తరం వుంది టేబిల్ మీద.

"జాక్పార్సన్సు" పేర వ్రాయబడి వుంది. యింటినెంబరునుబట్టి, తన యింటికే యివ్వబడింది. అతను వ్రాసిన చిన్నవల చాలా బాగుందని, ఆఫీసునకు ఒకసారివస్తే మేనేజరు చాలా సంతసించగలరని వ్రాయ బడివుంది.

మైకేల్ముందు ఏపనిచెయ్యాలో ఏర్పడి నందుకు చాలా సంతసించాడు. ఎలియ నార్తో పినతండ్రి యిచ్చిన ధనంగురించి చెప్పాడు. ఎలియనార్కి అకస్మాత్తుగా వచ్చిన సంపదనుచూచిన ఆశ్చర్యంకన్న, భర్త "పార్సన్సు" అని పేరు ఎందుకు మార్చుకున్నాడో అన్న అనుమానం హెచ్చి, అతన్ని ఖండితంగా అడిగింది.

నిర్మలమైన అర్ధరాత్రిసమయంలో ఆమెకు, జరిగినవిషయమంతా తెలియ జేసేడు మైకేల్. ఆమెకళ్లనుండి అశ్రువులు అప్రయత్నంగా రాలాయి.

రెండువేలపౌనులు ఒక పార్శిల్గా కట్టి "సర్ జేమ్సు, కమ్మింగ్. కె. బి. యి అని ఆమె స్వయంగా దానిపై వ్రాసి "బండిలో దొరికిన సొమ్ము" అని ఒక చిన్న కాగితం మీద వ్రాసి, పైచిరునామావారికి పంపి, ఆ దంపతులు శాంతిని పొందేరు.

---

# రుద్రమదేవి

(12-వ పేజీ తరువాయి)

చూచినంతనే యా పత్రమును మహారాజు కన్నుల కద్దుకొని యా పత్ర మంతయు పరిశీలించెను. అందులోని రహస్యమంతయు నామె కవగత మయ్యెను. ఆ వినతిపత్రమును దానితోపాటు నివేదించిన ఇతరపత్రములను ప్రక్క నున్న కార్యధురీణు డగు దామనామాత్యు నకు చూడ నిచ్చెను. దామనామాత్యు డవి చూచి యిట్లనెను.

"మహారాజా, దేవరవారు ముందు అంబదేవులతో నీ విషయము సంప్రదించి రేపటిదినమున నాజ్ఞ లిచ్చుట మేలని నా బుద్ధికి దోచుచున్నది."

వసదిప్రధానకరణ మా మాటలు విని నిలువున నీరై పోయెను. అయినను రుద్రదేవు లేమందురో?

శ్రీ రుద్రదేవమహారాజులు దామనామాత్యుల యుద్దేశముతో నేకీభవించిరి 'మాకును నదే భాసించినది.' అనిరి.

అంతట కార్యధురీణుడు వసతిపక్షమున వచ్చినవారిని మరునాడు రావలసిన దనియు ఇంకను దానికి సంబంధించిన పత్రములను సాక్ష్యములను ఉన్నచో తెచ్చికొనవలసిన దనియు వారికి రాజాజ్ఞ వినిపించెను. వినీతులై నమస్కరించుచు వారును సెలవుతీసికొనిరి.

వారిగుండెలలో రాయిపడినట్లే యైనది. అంబదేవునితో మహారాజు లాలోచించిన కార్య మనుకూలపడనిచ్చునా?

జరిగిన దంతయు వ్యవహర్తలు నాగాచారి కా సాయంత్రమే తెలిపిరి. అత డది విని వారివలె నధైర్యపడలేదు. అది మన కనుకూలించు సూచనయే అని నాగాచారి వారికి ధైర్యము చెప్పెను. అంబదేవుని యాజ్ఞలు మార్పుచేయ దలచియుండుటచేతనే ఆతనితో చెప్పి యాతని తృప్తిపరచుటకే శ్రీ రుద్రమహారాజు లట్లు శాసించి రని యాతడు సూచించెను. ఐనను ఎటుపోయి ఎటువచ్చునో యని ఇంకను సంపాదింపదగిన పత్రములను సాక్ష్యమును ఆతడు వారికి చెప్పి సిద్ధము చేయించెను.

ఆ వసతిలోని సాధువు లందరు నానా డుపవసించి యా రాత్రి యంతయు దము యిష్టదేవతల ప్రార్థించుచు జాగరములు సల్పిరి.

మొత్తముమీద నాగాచారి యూహించినట్లే అంతయు నడచెను. ఇట్లు వినీతులై వసదియధికారులు తన్ను అర్థించినపుడు కఠినముగా నుండుట యుక్తము కాదని మహారాజు తలంచెను. వసదివారెన్నడో కట్టుకొన్న భవనములు కూడ వదలి వెళ్ళు డనుట అన్యాయముగా అందరకు తోపకమానదు. అదియును గాక ఈ పత్రములు సిద్ధనంద్యాచార్యుల స్వహస్తనామముతో నంకితము లైనవి. వారి మాటలు సులభముగా త్రోసివేయుట కూడనిపని. అయినను వసదివారు రాజ్యకార్యమునకు నిర్లక్ష్యముగా విఘ్నమాచరింప నుద్యమించినపుడు అంబదేవుడు చేసిన ప్రతిక్రియకూడ శ్లాఘ్యమైనదే! రాజసేవలో నాతడు చూపిన నైపుణి ప్రత్యేకముగా ప్రశంసార్హమైనది.

అట్టి విశ్వాసపాత్రులును అగు రాజసేవకుల కెట్టి మనస్తాపమును కలిగించుటం యుక్తము కాదు. అందుచే రుద్రమ యా సాయంత్రమే అంబదేవుని తనసన్నిధికి పిలిపించి విషయ మేమని యడిగెను. అతడు జరిగిన దంతయు వివరించెను. ఆమెకు స్వయముగా తెలియనివి ఆమె యూహించినట్లే జరిగినవని అంబదేవుని ముఖమున దెలిసికొనెను. అంబదేవు డంతయు జెప్పినపిమ్మట రుద్రమ సిద్ధనంద్యాచార్యులు పంపిన వినతిపత్ర మాతని కిచ్చి చూడు మనెను.

అంబదేవు డది చూచి చిరునవ్వు నవ్వుకొనుచు, 'ఇందుపై మహారాజుల యాజ్ఞ యేమి?' అని ప్రశ్నించెను. అది యాలోచించుటకే ఆతని బిలిపించితి నని యామె యుత్తర మిచ్చెను.

అంబదేవుడు యోజించెను. తుద కాత డిట్లనెను.

"స్వామీ, తమరు వసదిపై నెంత కరుణ యైన జూపవచ్చును. కాని యా రత్నములును సువర్ణములును స్ఫాటికబింబమును మాత్రము—"

శ్రీ రుద్రదేవమహారాజు మధ్యలో నడ్డుతగిలి యడుగుకొనెను. "అవి వేరుగా నైభవముగా ప్రతిష్ఠాపిత మైనవి గదా! వాని గదలింప వీలులేదు. ఆ విషయమే ఎట్లు చేయుటా యనియే ముఖ్యముగా మేము యోజించుచున్నాము. మీయుద్దేశ మేమి?"

అంబదేవుడు: "స్వామీ, ఏ మున్నది? ఆ ప్రదేశము వారి దని నిర్ధారణచేయదగిన యాధార మేమియు లేదు. అగడ్త త్రవ్వించుటలో మనకింకను ఎన్నిరత్నములు వర్ణములు దొరకియుండలేదు? వాని నన్నిటిని జేసినట్లే ప్రభువుల చిత్తము ప్రకారము వీనిని గూడ నుపయోగింపవచ్చును. ఈ వ్యవహారమునకు మూలకారణభూత మగు నా ప్రదేశము మాత్రము వదలక తక్కిన ప్రదేశములును మఠములును వసదివారికి స్థిరపరచుచు ప్రభువులు కరుణింప వచ్చునేమో!"

రుద్రమ: "అంబదేవా, మీబోటి ప్రభుభక్తిపరాయణులు ప్రవర్తింపజేసిన యాజ్ఞలు న్యాయమైనవై యుండగా అట్టివానిని మేము తారుమారుచేయుట సమంజసమా యని యాలోచించుచున్నాము."

అంబదేవుడు వినయముతో నిట్లు విన్నవించెను.

"మహారాజా, మాబోటి ప్రభుసేవకులు కఠినముగా రాజద్రవ్యమును గాపాడుచు నాజ్ఞలు ప్రవర్తింపజేయుచునే యుండవలెను. అయితే నిగ్రహానుగ్రహసమర్థు లగు ప్రభువులు మా కఠినశాసనములను కారుణ్యముతో జతచేసి జనరంజకముగా ప్రవర్తింపజేయుటయు రాజధర్మము గదా!"

రుద్రదేవమహారాజు అంబదేవుని వ్యాఖ్యానమున కెంతయు నానందించెను. ఆ పిమ్మట నామె పరిఖాశిలాప్రాకారనిర్మాణాదుల సంగతులు ప్రస్తావించి యితర రాజకార్యములును మాట్లాడి యాతని బంపివేసెను.

మరునాడు ధర్మాసనమున శ్రీరుద్రదేవమహారాజు కూర్చుండి వసతియధికారులు తెచ్చిన నూతనపత్రములును సాక్ష్యములును శ్రద్ధగా పరిశీలించెను. వానిచే నగడ్తక్రిందికి వచ్చిన ప్రదేశము వసదికీయబడిన దని క్రొత్తగా నేమియు బుజువు కాలేదు. అట్టి ప్రయత్నము కూడ చేయవల దనియు నాగాచారి సూచించియే యుండును. ఎక్కువ సంపాదించుటకు కొంత వదలుకొనవలెను!

ఆనాడు శ్రీరుద్రదేవమహారాజు ఆ విషయమున నాజ్ఞ ప్రవర్తింపజేసి వసదివారి కది తెలియబరచెను. ఆ యాజ్ఞ మొదటి నుండి తుదవరకు కేవలము మహారాజులకు వసదిపైగల యభిమానముచే కరుణచే నచ్చటి శ్రమణులపై భక్తిచే ప్రవర్తింపజేసినట్లే యున్నది.

కాని వసదివారు చెప్పిన వాదమే విషయమునను అంగీకరించినట్లు లేదు. ఆ యాజ్ఞలో గర్భితముగా నొకానొక కారిన్యము కూడ నిమిడియున్నది. వసతియాక్రమణలో ప్రస్తుత మున్న స్థలములకు అందున్న ధర్మశాలలకు భవనములకు మందిరములకు మఠమునకు ఎట్టి యుపద్రవమును ఉండెదు. కాని యికముందు అంగుళము మేరయైనను వారు రాజానుమతి లేకుండ నాక్రమింప వీలుండదు. కాని ఇప్పటికే ఆక్రమింపబడిన ప్రదేశములకు భయము లేకుండ నట్టి ప్రదేశము లప్పుడే క్రొత్తగా ఇచ్చుచున్నట్లు ఆ శాసన ముండెను. ఇందువలన వసతిప్రక్క నున్న గుట్టలో ముప్పాతిక భాగము వసతివారు వదలు కొనవలసివచ్చెను. మరి యిక నగరుక్రింద పడిపోయిన డున్న ప్రదేశము ఎన్నడును వసది దని వాదించుటకైన వీలులేనిది. అందుచే అక్కడ లభించిన రత్నములు సువర్ణములు లింగమూర్తియు వారు తమ వని కోరుటకు అధారము లేనేలేదు. వాని విషయమున నంబదేవులు ప్రవర్తింపజేసిన యాజ్ఞలకు ఎట్టి మార్పును లేదు. అయితే ఆ తొలగించిన నేమినాథమూర్తిని యుక్తమగు ప్రదేశములో వసతివారు ముందు ప్రతిష్ఠింపదలచి శ్రీ రుద్రదేవమహారాజులకు మనవి చేసికొన్నచో నప్పుడు బొక్కసమునుండి యుక్త మని తోచిన ద్రవ్యము జినదేవులపై మహారాజులకున్న గౌరవముచే కట్నముగా సమర్పించుకొనగలరు!

ఆ శాసనముతో వసతివారు బయటపడితి మని నిట్టూర్పు విడిచి నాగాచారి మంత్రమును శ్లాఘించి యాతని నాశీర్వదించి బహుమతు లొసంగిరి. కాని బయటికి మాత్రము మా రత్నసువర్ణ రాసులు అన్యాయముగా జంగములు ఎత్తుకొని పోయి రని వారు గోలచేయుచునే యుండిరి. కాని వారి కక్కడ నిజముగా రత్నములు సువర్ణములు నిక్షేపింపబడి యున్నవని తెలిసియుండెనా?

చిత్రముగా కార్తికపూర్ణిమనాటికి వసతిలో నింతకాలముగా నున్న మహాయోగి యదృశ్యుడయ్యె ననియు నాతడుండెడి గది తెరచి శూన్యముగా నున్న దనియు ప్రకటిత మయ్యెను. భక్తులందరు నక్కడ జేరి 'ఇదిగో ఈ గదియే!—ఆ శిలాతలమే యా మహానుభావుడు కూర్చున్న ప్రదేశము! ఎక్కడికి వెళ్లెనో కదా మహాత్ముడు!' ఇట్లనుచు తీర్థప్రజగా జనులు వచ్చి యా గది చూడ సాగిరి. ఏ మున్నది?— ఆ గది శూన్యము!

'నేమినాథవిగ్రహము తీసివేయించిన యపినయము భరింపలేక ఆ మహాయోగి సల్లేఖనము చేసికొన శ్రవణబెల్గొళక్షేత్రమునకు గోమతీశ్వరవిగ్రహసన్నిధికి వెళ్లి యుండును!'

ఇట్లొక భక్తు డూహించినాడు! అన్ని యూహల కంటె నది యుక్తముగా తోచినది. తడాది అదియే అందరు అవలంబించి ప్రవర్తింప జేసిరి. అందుపై నాయన బయలుదేరివెళ్లుట చూచినా మనువారుకూడ వచ్చిరి. ఒకరు పాదచారియై వెడలె ననిరి. మరియొకరు గగనమార్గముననే పోయె ననిరి. ఏది ఎట్లున్నను జైనులలో సల్లేఖనము తరుచుగా జరుగుచుండెను. అది వేదమార్గానుయాయుల ప్రాయోపవేశము ననుకరించును. సల్లేఖనము చేయు జైనులు ప్రాణాంతమువరకు ఆహారము ముట్టక స్థిరచిత్తముతో శుద్ధబుద్ధైకస్వభావమగు నిజశుద్ధాత్మస్వరూపమునే ధ్యానించుచు దేహత్యాగము చేయుదురు. ఇది మోక్షమే ప్రాపింపజేయు నని జైనాగమములు తెలుపుచున్నవి.

---

# నవభారతంలో

(10-పేజీ తరువాయి)

అనిపించుకోవాలంటే, సర్వతోముఖంగా ప్రత్యేకతను గడించాలి. మన భారతీయ విజ్ఞానం, మన జాతీయజీవనంలోని వివిధపథాలలో నడిపిఉండినప్పుడు, భారతీయకళ దానంతటదే, భారతీయగతచరిత్రనుంచే కాకుండా, ప్రస్తుతకాలానుగతంగాకూడా అభివృద్ధి కాగలదు. దీనికే సంబంధం లేకుండా ఉంచటం ప్రత్యేకత కాకపోగా, సంస్కృతిలో సంకుచితత్వాన్ని కలగజేస్తుంది. సంకుచితత్వానికి, సహజమైన స్వచ్ఛమైన కళలో అసలు స్థానమే లేదు. సహజమైన స్వచ్ఛమైన కళ ఎప్పుడూ సర్వవ్యాపక మైంది. దాని కెల్లలు లేవు!! సంకుచితత్వం అసలు కళకే కాకుండా, స్వతంత్రదేశానికే వినాశాన్ని కలిగిస్తుంది.

ఒక కళాఖండం, మహాగ్రంథంవంటిది. దానిని చదువ నుద్దేశించి, అభిలషించి, కృషి చేసేవారికే, అది శాశ్వతానందాన్ని చేకూరుస్తుంది. పాఠకుడు విదేశీయుడైతే, అతనికి పరిశోత్తపోకడలు ఎన్నో అందులో కనిపిస్తాయి. దానివల్ల, తన సంకుచితదృక్పథాన్ని సహజంగానే మార్చుకుంటాడు.

అందువల్ల కళ విశ్వవ్యాప్తం కావాలంటే మొదట జాతీయం కావాలి.

మనం ఇప్పుడు స్వతంత్రులం అయాం కాబట్టి, మన భారతీయకళను, ఏ యే అభివృద్ధిమార్గాల్లో సాధన చేయాలో దీర్ఘంగా ఆలోచించాలి. ఆ మార్గాలు కేవలం జాతీయంగా ఉండాలి. అప్పుడు, ఇతరదేశాల యెదుట, మన దేశం, తన ప్రత్యేకతను తెలుపుకుంటుంది.

జె. ఎ. సైమండ్సు, "మానవానీకానికి కళాకారులు చేతులు, కవులు వాక్కు. మానవుల భావావేశాలు తెలియాలంటే, వాక్కురూపకంగా, కార్యరూపకంగాగాని వీలులే"ద న్నాడు. కళాకారులవెనుక, ఈ కవీ, జ్ఞానులూ తత్త్వజ్ఞులూ, నడుస్తారు. వారి చుట్టూ, ఆత్మను వ్యక్తంచేసే భావవైశాల్యం ఉంటుంది. దాంట్లో తేలియాడే మానవానీకానికి చివరికి, పరమైక్యతలో ముక్తి లభిస్తుంది.

ఈ 'సూక్ష్మవేదాంతం,' మన చిత్రకారుల కర్థం అయితే, కళ నేవిధంగా జాతీయం చేయాలో తెలుస్తుంది. అప్పుడే, మన భారతీయకళకు మంచి భవితవ్యము కలదని సంతసింపగలం.

అందుకు భారతీయప్రసిద్ధశిల్పాలూ, చిత్రాలూ ఒకచో సేకరించాలి. వాటిని సందర్శించే ఏర్పాటు, కళాకారులకు, ప్రభుత్వం ఏర్పాటుచేయాలి. ప్రభుత్వం అందుకోసం, చిత్రకారులకు ఉపకారవేతనాలు ఇవ్వాలి. ఆ సహాయంతో, చిత్రకారులు, ప్రసిద్ధకళానిలయాలనీ, తదితరకళాప్రదేశాలనీ, సందర్శించి, నూతనచిత్రాలను రచించగలరు. ఆ చిత్రాలను ప్రపంచం అంతటా ప్రచారం చేయాలి. ఆవిధంగా, ప్రపంచానికి, మన కళోద్ధతిని తెల్పినవారం కాగలం. ప్రపంచంనుంచీ, చిత్రకారులకు తగిన ప్రోత్సాహం రాగలదు.

అప్పుడే, ప్రభుత్వం, చిత్రకారులూ, శిల్పులూకూడా భారతదేశపు కళాసాంప్రదాయాన్ని నిలబెట్టి ఉద్ధరించగలరు!! అందుకు ప్రభుత్వం సత్వరం, తమ కార్యక్రమాన్ని కొనసాగించి, చిత్రకారులను వినియోగించి ప్రోత్సహించాలని, నా చివరి కోరిక!

# కళాపోషకుడు

(గల్పిక)

**శ్రీ కొడవటిగంటి కుటుంబరావు**

"సరదాగా కలిసిపోదామంటే, బెట్టు చేస్తావేమిటోయ్? ఇంట్లో కూచుని ఏం పొదుగుతావు?" అని చెప్పాడు రామ్మూర్తి.

"ఈ విశ్వనాథంగారిని నే నెరగను. ఆయన నన్నెరగడు. ఆయన ఇంటిమీద పడి వారంరోజులు తిష్ఠవెయ్యటానికి నీకు సిగ్గులేకపోతే నాకుండొద్దూ?" అన్నాను.

"చాలా పొరపాటుపడ్డావు. నీ పేరాయనకు తప్పక తెలిసుంటుంది. నిన్ను చూసి ఆయన సంతోషించకపోతే అప్పుడను!" అన్నాడు రామ్మూర్తి.

విశ్వనాథంగారు సాహితీప్రియుడనీ, పులివిస్తరాకుచుట్టూ కాకులుచేరినట్టు, వివిధ రచయితలు ఆయనఇంటిమీద వాలి రోజుల తరబడి పోరనీ నే నదివరకే విన్నాను. కాని ఇటువంటి కథలు నేను నమ్మలేను. నమ్మనూ లేదు.

ఆఖరుకు, రామ్మూర్తిబాధ పడలేక, వాడివ్వని ప్రగల్భాలని రుజువుచెయ్యటానికి, వాడివెంట బయల్దేరాను.

విశ్వనాథంగారు నిజంగా సాహితీప్రియుడే. సందేహం లేదు. ఆయనకు రాసేవాళ్ళంటే చెప్పతరంగాని మమకారం ఆయనతరంవాళ్ళలో నటకులమీదా గాయకులమీదా వ్యామోహంఉన్నవాళ్ళని నే నెరుగుదునుగాని ఇటువంటి వ్యామోహం రచయితలమీద ఎవరికీ ఉండగా నేను చూడలేదు.

నేనూ రామ్మూర్తీ వెళ్ళేసరికి ముగ్గురు నలుగురు ప్రసిద్ధరచయితలు ఉండనే ఉన్నారు. రామ్మూర్తిని చూడగానే విశ్వనాథంగారి ఆనందం చూసి నా శంక చాలా భాగం తీరింది. నా పేరు వినగానే ఆయన చూపిన సంతోషంతో అనుమానలేశం కూడా రహితమయింది. ఒక్కక్షణంలో విశ్వనాథంగారు నేను రాసిన అరడజను కథలపేర్లూ, అవి ప్రచురితమైన పత్రికలూ, సంవత్సరాలూ, మాసాలూకూడా ఏకరువు పెట్టేసి నన్ను ముగ్ధుణ్ణిచేసేశారు. ఇన్నేళ్ళనుండి రచయితగా ఉండి నేను ఎన్నడూ ఆయనను చూడనందుకాయన నన్ను గట్టిగా కోప్పడ్డారు.

విశ్వనాథంగారు నన్ను ఒక సిగరెట్టుముక్కయినా స్వంతాన కొనుక్కోనివ్వలేదు. నేనూ రామ్మూర్తీ అక్కడున్న వారంరోజులూ మాకు అల్లుడిలా గడిచిపోయింది.

ఏడోరోజు ఒక చిత్రం జరిగింది.

విశ్వనాథంగారింటికి అనేకపత్రికలు వస్తాయి. అందులో ఒకపత్రికలో రామ్మూర్తి రాసిన కథ ఒకటి పడింది. అది చదువుతుండగా నాకు కంపరం ఎత్తేసిపోయింది. రామ్మూర్తి అందులో ఈ విశ్వనాథంగార్నే పెట్టి చాలా అల్లరిజేశాడు. ఆయనను పట్టి చవటకింద చూపించటమే కాక ఆయనదగ్గిరవారిని గురించి కొన్ని అవాచ్యాలు కూడా రాశాడు.

నేను రామ్మూర్తిని ఇవతలికి పిలిచి, "ఇదేం పొయ్యేకాలం నీకు? ఈ పెద్దమనిషిమీద ఇట్లా రాశావు?" అన్నాను.

"అదంతా నిజమే. నేనేమీ కల్పించలేదు." అన్నాడు రామ్మూర్తి అమాయికం మొహంపెట్టి.

"నిజమైతేమాత్రం —"

"కథలు రాయమని పత్రికలవాళ్ళు పీడిస్తే ఎట్లా చావనూ? ఇక్కడికి వచ్చిన రోజే కూర్చుని రాసి పంపాను! అన్నాడు రామ్మూర్తి.

నాకీ మందమతికి ఆశ్చర్యం వేసింది

"నే చెప్పేది నీబుర్ర కెక్కటం లేదు. ఆయనచూస్తే ఏమనుకుంటాడు ఇంటితిని—"

"అదా నీ సందేహం? అట్లా చెప్పి యేడవ్వేం? ఆయన ఈ కథను ముందే చూశాడు!" అన్నాడు రామ్మూర్తి.

"ఏమీ అనలేదా?"

"బాగుందన్నాడు."

"కనుక్కోలేదూ?"

"ఏమిటి కనుక్కునేది? ఆయన చదువుతాడనుకున్నావా ఏమిటి? ఆయన సాహిత్యంచదవటం మానేసి చాలా ఏళ్ళయింది. ప్రస్తుతం చూస్తుంటాడు - ఏ పత్రికలో ఎవరెవరు ఏమేం రాస్తున్నారో!"

"అంతేనా?"

"అంతే."

ఆ సాయంకాలంబండికే నేను ఇంటిదారి పట్టాను. విశ్వనాథంగారు ఇంకా రెండురోజు లుండమని బతిమాలారు. కాని నాకిక అన్నంగాని నిద్రగాని అనుభవంలోకి రాదని భయంవేసింది. (కొ. కు.)

---

# ఖద్దరు విధానం

(14-వ పేజీ తరువాయి)

మధ్యతరగతులవారి ఉద్ధరణకు ప్రస్తుతం కొద్దిగానైనా తోడ్పడేది ఖద్దరే.

జనాభాలో ప్రతిపౌరుడూ దేశసంపదను వృద్ధిచేసే ఉత్పత్తిలో పాల్గొనాలి అనే విషయం అన్నివైపులనుంచి వింటున్నాం. కర్మాగారాల్లో, పొలాల్లో, ఇతరత్ర పనిచేసే పాటకజనం శక్తికొద్దీ పనిచేయలేదని, సోమరులుగా ఉంటున్నారని, చాలామంది పైతరగతులవారు విమర్శిస్తూఉంటారు. సరిగా చేసినా, చేయకపోయినా ఆ శ్రమజీవులు చెమటోడ్చి, పొలాల్లో, బట్టల మిల్లుల్లో, కర్మాగారాల్లో వస్తువులను ఉత్పత్తిచేస్తున్నారు. కాని పైతరగతులవారి పరిస్థితి ఏమిటి? కిందితరగతులవారిలో ఎంతమంది చెమటోడ్చి, ఉత్పత్తి నధికం చేస్తున్నారో, పైతరగతులవారిలో ఎంతమంది చెమటోడ్చి, ఉత్పత్తి నధికంచేస్తున్నారో పోల్చిచూస్తే, ఎవరు నిజమైన సోమరులో, ఎవరు దేశసంపదను అభివృద్ధిచేయకుండా భుక్తం చేసుకుంటున్నారో బోధపడుతుంది.

పల్లెల్లోని జనాభాకు, బస్తీల్లోని స్త్రీజనాభాకు, నిరుద్యోగులకు ఖద్దరు కాయకష్టంగానే కాక పక్కసంపాదనగా కూడా ఉపయోగిస్తుంది. ఎవరికి కావలసిన బట్ట వారు తయారుచేసుకోవచ్చు. పైతరగతులవారి నవనాగరికవస్త్రధారణను అనుకరించే మధ్యతరగతులవారికి బట్టలపై ఖర్చుకూడా కొంత తగ్గుతుంది.

మన ఎగుమతులదృష్ట్యా, బట్టలఎగుమతి ముఖ్యమైన వ్యాపారం. మిల్లు ఉత్పత్తి చేసే గుడ్డను దేశంలో తక్కువగా వినియోగించి, ఎక్కువగా విదేశాల కెగుమతి చేస్తే, మన ఆదాయం హెచ్చి, పారిశ్రామికవ్యాప్తికి కావలసిన యంత్రసామగ్రిని కొనుక్కోటానికి తగిన ధనవసతి సిద్ధిస్తుంది.

కాబట్టి నిరుద్యోగసమస్యదృష్ట్యా, మన దేశపు రైతాంగపు జనాభాదృష్ట్యా, మధ్యతరగతులవారి స్త్రీజనాభాదృష్ట్యా పైతరగతుల సోమరులదృష్ట్యా, ఎగుమతివ్యాపారం దృష్ట్యా ఖద్దరు అవలంబించవలసినవిధానం అని బోధపడగలదు.

ఖద్దరు ఒక చాదస్తమని, రాట్నం తిప్పటం అనాగరిక మని, ఆర్థికంగా ఎక్కువ సంపాదనకు తోడ్పడదని చేసే వ్యర్థ, అప్రస్తుతవాదవివాదాలు మాని దేశంలో నిజ, ప్రస్తుతపరిస్థితులను క్షుణ్ణంగా గ్రహించి,పారిశ్రామికవ్యాప్తికి ఏళ్లూ, పూళ్లూ పట్టకతప్పదని, ఎంత యంత్రమయమైనా, జనాభాయావత్తుకూ తగిన ఉద్యోగాలు లభించవని తెలుసుకొని, సులభంగా ప్రజలకు తక్షణం తోడ్పడే ఖద్దరువిధానాన్ని ప్రస్తుతఅవసరంగా గుర్తించి, అందుకు తగ్గట్టుగా ప్రజలు ఇంటింట రాట్నాలు నెలకొల్పటం ధర్మం.

## తాన్‌సేన్ గర్వం

(25 పేజీ తరువాయి)

నేర్పుతారు? అసలే అతనికి నిద్రాహారాలు లేవు. ఏమైనా తల్లిదండ్రులను విడిపించాలనే ఉద్దేశమే అతని ముందు ప్రత్యక్షం కాజొచ్చింది. తన తల్లిదండ్రులు జైలులో పడే బాధలే అతనికి జ్ఞప్తికి వస్తున్నాయ్. ఇవి తలచుకుంటూ అతడు ఒక అరుగుమీద నిద్రపోయాడు.

అతనికి మెళకువ వచ్చేటప్పటికి తెల్లవారింది. అనేకమంది విద్యార్థులు ఆదారిని నడచిపోతున్నారు. వారిలో ఒకరిని పిలచి తనకోరిక తెలియజేశాడు. ఆ విద్యార్థి ఇతని మాటలు చూచిఫక్కున నవ్వాడు. అయినా ఏరాయిలో యేముందో! అని తన గురువుగారిదగ్గరకు తీసుకొనివెళ్ళాడు. అక్కడ గురువుగారికి శుశ్రూష చేసి, మధూకరవృత్తి నవలంబించి పండ్రెండుసంవత్సరాలు కష్టపడి సంగీతం నేర్చుకున్నాడు. తనకి సంగీతం పూర్తిగా వచ్చినతర్వాత గురువుగారివద్ద సెలవు తీసుకొని ఢిల్లీకి పయనమయాడు.

ఇంక ఢిల్లీలో తాన్‌సేన్ ప్రతిభ మహావైభవంగా వెలిగిపోతోంది. ఇంతవరకు అతణ్ణి జయించినవారు లేకపోయారు. ఇంక మనవిద్వాంసుడు ఒకరాగాన్ని ఆలాపిస్తూ తాన్‌సేన్ భవనం ముందునించి వస్తున్నాడు. అతనికి ఇప్పుడు ఇరవైరెండుసంవత్సరాల వయస్సు. ఈ పాట విన్న భటులు కొంతసేపటివరకు కొయ్యబొమ్మలవలె నిశ్చేష్టులై పోయారు. తరువాత వాళ్ళ కర్తవ్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని ఈ విద్వాంసుణ్ణి రాజాస్థానానికి లాక్కొనిపోయారు. అక్కడ అగ్బరుచక్రవర్తి తాన్‌సేన్‌తో పోటీ చేస్తావా లేక యావజ్జీవం జైలులో ఉంటావా? అని ప్రశ్నించాడు.

మన విద్వాంసుడు పోటిచేస్తానని చెప్పాడు. ఈ మాటలకి అక్కడున్న ప్రజలంతా ఆశ్చర్యపోయారు. సరే పోటి ప్రారంభమయింది. మనవిద్వాంసు డాలాపన చేసినరాగాలకి అంతా ఆశ్చర్యపోయి తాన్‌సేన్‌కంటె అనేకరెట్లు గొప్పగా పాడాడని ముక్తకంఠంతో పలికారు. తాన్‌సేన్‌కినలుగురిలోనూ గర్వభంగం అయింది అగ్బరుచక్రవర్తి సికేం కావాలో కోరుకొమ్మన్నాడు. అప్పుడు మన విద్వాంసుడు తనకథంతా చెప్పి తన తల్లిదండ్రులని విడిపించమని కోరాడు. అగ్బరుచక్రవర్తి వెంటనే వారి నందరినీ విడుదలచేయించి వారి కందరికీ అనేకఅగ్రహారాలిచ్చి గౌరవించాడు.

---



# సిసలైన చిత్రకారుడు

**శ్రీ గంటా**



పూర్వము గ్రీకుదేశములో అలెగ్జాండరు అనే గొప్పవీరు డుండేవాడు. అత డనేకయుద్ధాల్లో గెలిచి గొప్పకీర్తిని సంపాదించుకున్నాడు. తనకీర్తి చిరస్థాయిగా నిలిచేందుకుగాను తనచిత్రాన్ని గీయించుకో దలచి గొప్పచిత్రకారుణ్ణి పిలిపించేడు. కాని ఆ చిత్రకారుడు అలెగ్జాండరుబొమ్మ గీసేముందు పెద్ద చిక్కులో యిరుక్కున్నాడు. ఎందుకంటె అలెగ్జాండరు నొసలు మీద ఒక మచ్చ ఉన్నది. ఆ మచ్చ బొమ్మలో కనుపించేట్టు గీస్తే చిత్రము అసహ్యంగా కనుపించి ఆ వీరుని కీర్తికి కళంకాన్ని ఆపాదిస్తుంది. అందుకని మచ్చ లేకుండ చిత్రము గీస్తే, అది నిజమైన అలెగ్జాండరుబొమ్మ అనిపించుకోదు. రెండోవిధంగా బొమ్మ గీస్తే తాను పవిత్రమైన చిత్రకళకు ద్రోహము చేసినవా డౌతాడు. అందుచేత చిత్రకారుడు మూడోమార్గాన్ని అనుసరించేడు. అలెగ్జాండరుచేతిని ఆ మచ్చను కప్పియుండునట్లు చేసి, ఆ యాకారాన్ని తనబొమ్మలో గీసి, అలెగ్జాండరుకీర్తికి మచ్చ కలుగకుండ, తాను చిత్రకళకు మచ్చ తేకుండ తప్పించుకొన్నాడు.—

---

# రాజ్యాంగచట్టాలకు-

(17 వ పేజీ తరువాయి)

అయితే మామూలుమంత్రికి ప్రధాన మంత్రికి ఒక భేద ముంది. మామూలుమంత్రి ఇష్టంలేకుంటే రాజీనామా యియ్యవచ్చును. ప్రధాని ఇష్టం లేకుంటే, తన మంత్రివర్గాన్ని మార్చి వేరే మంత్రులను ఎన్నుకోవచ్చును. కాని ఒక మంత్రివర్గము ఉన్నంతవరకూ వాళ్ళమాట పాలించక తప్పదు.

ఇది రాజ్యాంగవిధానం. కాంగ్రెసు పాలకులు ప్రజాస్వామ్యబుద్ధితో ఎంతవరకూ దీన్ని పాలించనున్నారని ప్రశ్న. తరతరాలకు ఏకచ్ఛత్రాధిపతుల కలవడ్డ ప్రజ ప్రజాస్వామ్యసూత్రాలను గాలికి వదిలిన నిరంకుశ పాలనకూ అలవాటుపడిపోవచ్చును. వాళ్లకు మునుపున్నదీ ఇప్పుడు పోయిందీ ఏమీ కనపడకపోవచ్చును. కాని అసలు ప్రశ్న భారతదేశంది పార్లమెంటరీ ప్రజాస్వామ్యమా, అయితే మంత్రాంగము ఒప్పుకోనీ ఒప్పుకోకపోనీ, నా విధానం నేను అనుసరించేదే, మంత్రాంగం నన్ను అనుసరించాలితప్ప, నేను మంత్రాంగాన్ని అనుసరించేది లేదు" అన్న ప్రధానమంత్రి వాక్యాలను సమర్థించుకోటానికి వీలు ఉంటుందా ? అసలు నిగ్గు తేలిస్తే కేంద్ర మంత్రివర్గము ఇద్దరు వ్యక్తులలోకే తేలుతుంది. పండిట్ నెహ్రూ, సర్దార్ పటేలు. తక్కినవాళ్లకు ఒక్కొక్కప్పుడు ఏంజరుగుతూందో కూడా తెలియకనే పోవచ్చును. ఇదేకాకుండా కాంగ్రెసు మంత్రులు, కాంగ్రెసేతర మంత్రులు అని మళ్లీ రెండు భాగాలు. కాంగ్రెసేతర మంత్రులకన్న కాంగ్రెస్ మంత్రులకు పక్షబలా లెక్కువ. కాంగ్రెసేతరమంత్రులు నామినేటెడ్ మంత్రులు, నెహ్రు పటేళ్ల అజలోని వారూ కాబట్టి ఇప్పటి బాధ్యతఅంతా మంత్రివర్గంలో ఎప్పుడూ తమ వ్యక్తిత్వము నిరూపించుకోచూడని కాంగ్రెస్ మంత్రుల మీదే ఉంటుంది. మంత్రివర్గానికి అతీతుడనని ప్రధానమంత్రి అన్నాడంటే, మంత్రులను సంప్రదించటానికిగాని, సలహాతీసికోటానికిగాని ఎక్కడా అపేక్షలేదని తెలుస్తుంది. కాంగ్రెస్ ఈమంత్రులను ఏ స్థానంలో ఉంచుతున్నారో ప్రధానమంత్రి కాంగ్రెస్‌పార్టీకి తెలిపిన వాడయాడు. ఈదెబ్బతిన్న మంత్రులు ముందు కొంత గొణిగారు. చివరికి సమాధాన పడ్డారు. మందహాసాలుకూడా చేశారు. ప్రధానమంత్రి ఉద్రేకపూరితుడని వాళ్లకు తెలుసుకదా! తమమీద ఈయనకు కోపంతెచ్చి నవాళ్ళ మీదికి కోపాలు తిప్పుకొన్నారు. ఢిల్లీదర్బారులో అల్లాంటి స్వార్థపరు లెందరు లేరు,

బడ్జెటుమీద చర్చ, మామూలుసాంప్రదాయపు పద్ధతులలోనే జరిగింది. రాజ్యాంగ చట్టం ఏమిటో తెలియకుండా, దేశఆర్థిక పరిస్థితి ఏమిటో గమనించకుండా ఈ చర్చ జరిగింది.

రాష్ట్రాలకు, వ్యవసాయం, విద్య, ఆరోగ్యం, కుటీరపరిశ్రమలకు, ఎక్కువ గ్రాంటులకోసం నిత్యం అడగటం పరిపాటై పోయింది. కుటీరపరిశ్రమలు ఫామ్ అయిపోయాయి. కేంద్రవ్యవహారాలు, రాష్ట్రవ్యవహారాలు అన్న విభేదం అర్థశూన్యమై పోయింది. పార్లమెంటువత్తాసుతో, కేంద్రంరాష్ట్రాల అధికారాలు కూడా స్వగతం చేసుకొంటూంది. చిత్రమేమిటంటే గ్రాంటుల కన్నిటికీ ఆమోదం తెలిపాక, సభ్యులు ఖర్చులవిషయంలో ఆర్థికశాస్త్రం ఏకరువు పెట్టారు. ఉద్యోగాల్లోంచి ఒక చేత్తో తీసేస్తో, రెండో చేత్తో వాళ్లకు వృత్తి లేవని అడుగుతున్నారు. సంఘసేవాకార్యాలకు గ్రాంటులు ఎక్కువడుగుతూ, పన్నులు తగ్గించమంటూ పరవళ్లు తొక్కుతారు. భారతదేశం అభేద్యంగా రక్షించబడాలి. ఉద్యోగంలోంచి తీసేసిన ప్రతివ్యక్తికీ వృత్తి చూపించాలి. ఆహారపరిస్థితి దెబ్బతినకూడదు. కాగా ఫైనాన్సుమంత్రి పన్ను లేవీ హెచ్చించకూడదు. ఈ స్వర్గమే లభిస్తే!

---



అమెరికా ప్రథమాధ్యక్షుడు జార్జి వాషింగ్‌టన్ జన్మదినోత్సవసందర్భంలో అధ్యక్షుడు ట్రూమన్ ప్రసంగించుచున్న దృశ్యం. (ఫిబ్రవరి 22)

# నేటిప్రపంచం

## పులుల్లేని అడవుల్లో మనుషులవేట ★

రాజ్యాధికారాన్ని పరహస్తగతం చేసిన ఒక రాజు పులివేటకి బయలుదేరితే పులులే కనిపించలేదు. రాయల్ బెంగాల్ టైగర్స్‌కి ప్రసిద్ధికెక్కిన సుందరవనారణ్యాలలో పులులేమైనాయో తెలియదు. మతం పేరిట మాతృమూర్తులపైన జరుగుతున్న ఘోరాపచారాలకి సహించలేక మానవుల ముఖం చూడకూడదని ప్రతిజ్ఞపట్టాయా? లేక మనుష్యుల్ని మనుష్యులే వేటాడే దేశంలో మనుష్యులు పులులుగానూ, పులులు మనుష్యులుగానూ కనిపించారా? ఏదయితేనేం పర్షియన్ రాజు తూర్పుబెంగాల్లో వేటకి వెళ్ళినప్పుడు పులులు కనిపించలేదు. పర్షియారాజు తూర్పుబెంగాల్లో వేటకి రావడంలో విచిత్రసన్నివేశం ఒకటుంది.

కాశ్మీర్ సమస్యలో బ్రిటిష్ ప్రభుత్వం అక్రమంగా జోక్యంచేసుకుంటున్నదనీ, వాస్తవానికి భారతదేశంపైన మాటిమాటికీ పాకిస్తాన్ కాలుదువ్వడానికి బ్రిటన్ ప్రోద్బలమే కారణమనీ లండన్ కమ్యూనిస్టుపత్రిక వ్రాసింది. ఆంగ్లో-అమెరికన్ వర్గాల తంత్రాలఫలితంగానే కాశ్మీరం గురించి భారతపాకిస్తాన్ల మధ్య వివాదం సవ్యంగా పరిష్కారం కావడానికి వీల్లేకపోతున్నదనే విషయం స్పష్టపడిపోయింది. ఇటీవల భద్రతామండలితీర్మానాన్ని అనుసరించి మధ్యవర్తిని నియమించే విషయంలో కూడా ఆంగ్లో-అమెరికన్ వర్గం పన్నిన తంత్రంవల్లనే ఇంతవరకూ సమాధానం కుదరలేదు. భారతప్రభుత్వం ప్రతిపాదించే ప్రతి ఒక్క వ్యక్తినీ బ్రిటిష్ అమెరికన్ ప్రభుత్వాల సలహాపై పాకిస్తాన్ ప్రభుత్వం నిరాకరిస్తోంది. ఎలాగైనా ఒక అమెరికన్ సైనికాధికారిని, లేదా అమెరికన్ విదేశాంగశాఖ తనుపున అంతర్జాతీయరాజకీయాల్లో పనిచేసిన ఒకనిని నియమింప చెయ్యాలని అమెరికన్ ప్రభుత్వం పట్టుదల. ఇంతవరకూ భారతప్రభుత్వం ఈ తంత్రానికి లొంగలేదు. ముందు ఏమి జరుగుతుందో చూడాలి.

ఈ తంత్రాల ఆంతర్యంకూడా అందరికీ విశదమే. ఫిలిప్పైన్స్, కొరియా, సయాం, ఇండోచీనాలలో మాదిరిగానే కాశ్మీరం, నేపాల్ దేశాలలోకూడా స్థావరాలు సంపాదించాలని అమెరికాయత్నం. నేపాల్ టిబెట్ సరిహద్దులో ఉన్నందువల్లనూ, కాశ్మీరం రష్యాకు సమీపంలో ఉన్నందువల్లనూ, కాశ్మీరంలోని లడఖ్ ప్రాంతం కూడా చీనాకు సరిహద్దులో ఉన్నందువల్లనూ, కాశ్మీరం నేపాల్ దేశాల్లో స్థావరాల్ని అమెరికా సంపాదించగలిగితే, రష్యాపైన యుద్ధానికి చక్కగా పనికి వస్తాయి. రష్యాపైన, చీనాపైన విమాన యుద్ధానికి కాశ్మీరం, నేపాలం, ఇరాన్ దేశాలకంటె అనువైన వింక ఎక్కడా లేవు. కాశ్మీరం నేపాలదేశాలలో అమెరికాకు స్థావరాలు లభించినట్లయితే, రష్యా-అమెరికాలమధ్య యుద్ధమే సంభవిస్తే, రష్యాదృష్టి మొట్టమొదట యూరప్ పైన పడదు. కాశ్మీర్ నేపాలాలపైన పడుతుంది. అంటే రష్యా అమెరికాలమధ్య యుద్ధానికి యూరప్‌కి బదులు తూర్పుఆసియా రణరంగమైనట్లయితే అమెరికాకు చాలా లాభం. యూరప్‌లోనే యుద్ధం ప్రారంభమైతే రష్యన్ సైన్యాలను నిరోధించగల బలం ఏదేశానికీ లేదు. అదే ఆసియాలో ప్రారంభమైతే అమెరికన్ విమానాలు సులువుగా రష్యాపైన దెబ్బతియ్యగలుగుతాయి. ఏటంబాంబులూ హైడ్రోజన్ బాంబులతో యుద్ధంచేసినా ఆసియావాసులే లక్షలాది మరణిస్తారు కాబట్టి యూరప్ అమెరికాలకి చింత అవసరం ఉండదు.

ఆంగ్లో-అమెరికన్ రాజ్యాలు ఈ దురుద్దేశంతోనే ఎలాగైనా కాశ్మీరాన్ని పాకిస్తాన్‌కి కట్టబెట్టాలని శతధా యత్నిస్తున్నాయి. నేపాళంలో ప్రవేశించడానికి అమెరికా చేసిన యత్నం, దుష్ప్రచారం వ్యర్థమైనాయి. కాశ్మీరం భారతదేశంలో చేరినట్లయితే ఇంక ఈ ప్రాంతంలో అమెరికన్లకి తావు చిక్కడం అసంభవం. రష్యా అమెరికాలమధ్య విరోధాలకి ఆసియా బలి కావడం పండిట్ నెహ్రూకు ఇష్టం లేదు. తూర్పుఆసియాదేశాలు ఏ సైనికపు టొడంబడికల్లోనూ చేరకూడదని పండిట్ నెహ్రూ పదేపదే చెప్తూవచ్చారు. వీలైతే ఆసియాఖండాన్నీ, లేదా కనీసం భారతదేశాన్ని ఏటంబాంబుల యుద్ధాలకి బలి కాకుండా కాపాడాలని పండిట్ నెహ్రూ సంకల్పం. ఈ విషయాన్ని అమెరికా సంచారసందర్భంలో స్పష్టంగా చెప్పారు. అది అమెరికన్లకి బొత్తిగా రుచించలేదు. పండిట్ నెహ్రూకి అమెరికా పట్ల నిరసన అధికమయిందని 'టైమ్' మొదలైన పత్రికలు విమర్శిస్తున్నాయి.

పాకిస్తాన్ పరిస్థితి వేరు. ప్రక్కన భారతరిపబ్లిక్ బలీయంగా ఉన్నంతవరకూ పాకిస్తాన్‌కు ముప్పేనని ఆంగ్లో-అమెరికన్ పత్రికలు ప్రచారంచేస్తున్నాయి. ఈమధ్య లండన్ "టైమ్స్" పత్రిక, పాకిస్తాన్ అఫ్ఘనిస్తాన్ సరిహద్దుప్రాంతాలనుంచి ఒక విలేఖరి పంపిన లేఖను ప్రచురించింది. సరిహద్దుప్రాంతంలో ఉన్న పఠాన్లతో ఆ విలేఖరి మాట్లాడాడట. సరిహద్దుప్రాంతమంతా పాకిస్తాన్‌కి చెందినదే నని వారన్నారట. కాని భారతదేశంవైఖరే వారికి భయకారణంగా ఉండట. ఎందుకంటే ఇటు కాశ్మీరాన్ని సాధించడంకోసం పాకిస్తాన్‌పైకి అటు అఫ్ఘనిస్తాన్నీ, పఠాన్లనీ పురికొల్పాలని భారతప్రభుత్వం ప్రయత్నిస్తోందిట. అయితే భారతప్రభుత్వం "దుస్తంత్రాలకి లోబడి" అఫ్ఘనిస్తాన్ పాకిస్తాన్‌పైన దురంతం జరిపినట్లయితే, పఠాన్లందరూ పాకిస్తాన్‌పక్షమే వహిస్తారని వారు ఆ విలేఖరికి చెప్పారట.

భారతప్రభుత్వం అఫ్ఘనిస్తాన్ ప్రభు

త్యాన్నీ పరాన్లనీ పురిగొల్పడానికి ప్రయత్నిస్తున్నదనడం శుద్ధఅబద్ధమనీ, పాకిస్తాన్ భారతదేశాలమధ్య విరోధాన్ని శాశ్వతపరచడమే ఈ దుష్ప్రచారంలోని అంతరార్థమనీ సులువుగా గ్రహించవచ్చును. అయితే పాకిస్తాన్‌నాయకులకిగాని ప్రజలకిగాని ఇది తెలియడంలేదు. కారణం ఏమిటంటే వారికి కమ్యూనిస్టుముప్పు అంతగా లేదు. ఇస్లాంరాజ్యస్థాపనే ప్రధానాశయంగా పెట్టుకుని పాకిస్తాన్‌లోని హిందువులందర్నీ తరిమివేస్తున్నారు. భారతరిపబ్లిక్ తమకు పరమశత్రువని వారి భావన. భారతప్రభుత్వాన్ని బలహీనపరచడంకోసం ఆంగ్లో-అమెరికన్‌వర్గాల తంత్రాలకి లోబడ్డం వారి కంత కష్టం కాదు. అదీగాక బ్రిటిష్ అమెరికన్ రాజనీతిజ్ఞుల సలహాల్ని వింటే, వారు పాకిస్తాన్ని ఆర్థికంగా ఉద్ధరించగలరనీ, తమ పరిశ్రమల్ని వృద్ధిపరచగలరనీ వారి ఆశ. అందువల్ల కాశ్మీరం పాకిస్తాన్‌స్వాధీనమైనట్లయితే అమెరికన్లకి అక్కడ స్థావరం ఇవ్వడానికి పాకిస్తాన్ సంకోచించదు.

ఇంతేకాదు. పాకిస్తాన్ ఆర్థికంగా ఎంత బలపడినా ఆంగ్లో-అమెరికన్‌వర్గాలకి వెరపు అవసరంలేదు. భారతదేశం బపలడినట్లయితే, ఆసియా దేశాల్ని దోచుకోడానికి వీలుపడనివ్వకపోవచ్చును. కమ్యూనిస్టుముప్పు ఎంత భయంకరంగా ఉందని బెదిరించి ఎంత వెర్రిగా ప్రచారం చేస్తున్నా, కమ్యూనిస్టు ప్రమాదాన్నెదిరించడానికి అంతరంగిక ఆర్థిక బలంపైనే ఆధారపడిఉండాలిగాని, దోపిడి వర్తకంచేసే దేశాల సహాయం కోరినట్లయితే పిట్టలపోరు తీర్చిన పిల్లి సామెత సార్థకమౌతుందని భారతదేశానికి తెలుసును. కాబట్టి కాశ్మీరాన్ని ఎలాగైనా పాకిస్తాన్‌కి కట్టబెట్టాలని ప్రయత్నించేస్తూ, ఆంగ్లో - అమెరికన్‌వర్గం భారతదేశానికి విరుద్ధంగా ప్రచారం చేయిస్తోంది.

ఈ దుష్ప్రచారం ఈ మధ్య అరబ్ దేశాల్లో అధికమయింది. లండన్ బి. బి. సి. రేడియో, పత్రికలుకూడా పాకిస్తాన్ ప్రచారానికి సహాయపడుతున్నాయనీ, భారతదేశంనుంచి వెళ్లేవార్తల్ని ప్రచారం చెయ్యడంలేదనీ భారతవిదేశాంగశాఖ ఉపమంత్రి డా॥ కేస్కర్ పార్లమెంటులో చెప్పారు. మస్లిందేశాలన్నీ ఏకమై కమ్యూనిస్టుప్రమాదాన్నెదిరించాలని ఆంగ్లో-అమెరికన్‌వర్గం ప్రచారం ప్రారంభించింది. ఈమధ్య పశ్చిమబెంగాల్, తూర్పుబెంగాల్ రాష్ట్రాల్లో సంభవించిన మతకలహాల సందర్భంలో భారతదేశానికి విరుద్ధంగా అన్ని దేశాల్లోనూ ప్రచారం తీవ్రంగా జరిగింది. సత్యాన్ని కప్పిపుచ్చి, పాకిస్తాన్‌లో ఎంతటి దురంతాలు జరిగాయో ఎంతమంది దుర్మరణంపాలైనారో, అంతటి దురంతాలు, అన్ని దుర్మరణాలు భారతదేశంలో కూడా సంభవించినట్లు ప్రచారం చేశారు. ఇది అసత్యప్రచారమే కాదు. అమానుషమైన కిరాతకచర్యలకి బలై ప్రాణాల్నీ, మానాన్నీ, సంపదల్నీ కోలుపోయిన వేలాది స్త్రీలు, బాలబాలికలు, పురుషులపట్ల మహాపచారం చేశారు. ఈ అన్యాయానికి ప్రతీకారం హైడ్రోజన్‌బాంబు కాదు. దుస్తంత్రపారీణులైనవారికి తగిన దండన మనుష్యులకు తెలిసినది లేదు.

ఈ దుష్ప్రచారం పర్షియాలో అత్యధికంగా జరగడం, పర్షియన్ సుల్తాన్ పాకిస్తాన్ సందర్శించడం, ఈ సందర్భానికి సరిగ్గా రెండురోజులముందే లండన్ 'టైమ్స్'పత్రికలో విలేఖరి పంపిన పైలేఖ ప్రచురించబడ్డం, ఇదంతా బ్రిటిష్, అమెరికన్ రాజకీయవేత్తల తంత్రమే. కాశ్మీరంలోనే తిరిగి యుద్ధం సంభవించినట్లయితే అఫ్ఘనిస్తాన్‌గాని సరిహద్దు పఠాన్లుగాని పాకిస్తాన్‌పైన యుద్ధం చెయ్యకుండా, వారిపైన పర్షియాను పురిగొల్పడానికి ఇది అమెరికా వేసిన ఎత్తు. పర్షియా అంటే అమెరికన్ల చేతిలో కీలుబొమ్మ అనే విషయం సుస్పష్టమే. పర్షియన్ సుల్తాన్ పేరుకి సుల్తానే కాని పర్షియాలో వాస్తవంగా పరిపాలిస్తున్నవారు అమెరికన్‌సలహాదార్లు. వారు నిలబడమంటే పర్షియన్ సుల్తాన్ నిలబడాలి. కూర్చోమంటే కూర్చోవాలి. పాకిస్తాన్‌తో సఖ్యతమిషతో, అఫ్ఘనిస్తాన్ని బెదిరించే ఎత్తుతో పర్షియారాజుని పాకిస్తాన్‌సంచారానికి పంపారు. అంటే కాశ్మీరంలో పాకిస్తాన్ తిరిగి యుద్ధానికి దిగడానికి ఇదొక సూచనగా భావించాలా?

## ప్రాణంతో చెలగాటం *

వియత్‌నమ్‌లో యుద్ధసన్నాహాలు జోరుగా సాగుతున్నాయి. గ్రీస్‌లో మాదిరిగానే రష్యా అమెరికాలు ఇక్కడకూడా బలాబలాలు పరీక్ష చేసుకోగలవు. పిల్లికి చెలగాటం ఎలక్కి ప్రాణసంకటం. మధ్య అనుభవించేది వియత్‌నమ్‌ప్రజలు. వియత్‌నమ్‌లో పోరాటానికి అమెరికన్లు ఆయుధాల్నీ సైనిక నిపుణుల్నీ పంపినదే తడవుగా కమ్యూనిస్టుల ప్రాంతంమీదికి దండయాత్ర చెయ్యడానికి ఫ్రెంచిసైన్యాలు సిద్ధంగా ఉన్నాయి. ఇటీవలనే వియత్‌నమ్‌లో ఆర్థిక సైనికసహాయాల నిచ్చే నిమిత్తం అమెరికన్ ప్రభుత్వం నూరు మిలియన్ల డాలర్ల ఖర్చు మంజూరుచేసింది. గ్రీస్ పర్వతాల్లో గొరిల్లాలతో యుద్ధంచేసి అరణ్యాలలో యుద్ధంలో ఆరితేరిన "అమెరికన్ సైనిక నిపుణుల్ని" అమెరికా వియత్‌నమ్‌కి పంపుతోంది. అమెరికన్ల పేరుచెప్తే కమ్యూనిస్టులకి హడలని వీరి ఉద్దేశం కాబోలు. బ్రిటిష్ నౌకాబలం పేరుచెప్తే లోకంలో ఎవ్వరూ నోరెత్తలేరనుకున్న రోజు లుండేవి. ఇంకా ఉన్నాయనుకున్నారు బ్రిటిష్ అధికారులు. యాంగ్సీ నదీతీరంలో చీనాజాతీయవాదులు కమ్యూనిస్టులమధ్య యుద్ధం జరిగినప్పుడు అదేధీమాతో మూడు బ్రిటిష్ నౌకలు నదిని ప్రవేశించాయి. కాని కమ్యూనిస్టులు పరాభవంచేశారు. నౌకాబలసార్వభౌములు నోరెత్తలేదు.

ఇప్పుడు అమెరికన్లు కూడా అదేధీమాతో ఇండోచీనాలో తమ ప్రజ్ఞ ప్రదర్శిస్తున్నారు. ఇంటివెనకపంచలో పచార్లు చేస్తున్నట్లు సప్తసముద్రాల్లోనూ ఊరికే పచార్లుచేస్తూ అమెరికన్ విమానవాహక నౌకలు సైగాన్ రేవు చేరాయి. అపైన అరణ్యాల అందం చూడ్డానికన్నట్లు కమ్యూనిస్టుల అధీనంలోఉన్న ప్రాంతానికి అమెరికన్‌విమానాలు వాహ్యాళి వెళ్లాయి. ఈ మాదిరిగా రష్యన్‌విమానాలు జపాన్‌పైన విహరిస్తే అమెరికన్లు ఊరుకుంటారా? పరాయిరాజ్యాల వ్యవహారాల్లో అక్రమంగా జోక్యం చేసుకుంటున్నారని దుయ్యబట్టేవారే. కమ్యూనిస్టులు అమెరికన్‌విమానవాహకనౌకలపైన ఫిరంగులు కాల్చారు. కాల్చినందువల్ల కలిగిన ఫలితమేమిటో, ప్రతీకారమేమైనా జరిగిందోలేదో రాయిటర్సువంటి వార్తాసంస్థలు తెలపలేవు.

తాను పోరాడలేక వస్తాదు పెద్దన్నని దీసుకొచ్చి కక్షతీర్చుకో యత్నించే ఫ్రెంచివారి పట్ల కమ్యూనిస్టువిరోధులకి కూడా రోత కలిగింది. సైగాన్‌నగరంలో అన్ని పక్షాలవారూ నిరసనసభలు జరిపారు.

సాయుధులైన కమ్యూనిస్టుల్ని ఎదిరించలేకపోయినా నిరాయుధులైన ప్రజలపైన ఫ్రెంచిసైనికులు తుపాకులు కాల్చారు. కొందరు విద్యార్థులు మరణించారు.

ఫ్రెంచివారు పూర్తిస్వాతంత్ర్యం ఇవ్వడానికి సిద్ధపడినట్లయితే బావోదాయ్ ప్రభుత్వంతోటే రాజీ చేసుకోగలమని కొందరు జాతీయవాదులన్నారు. కాని అది కమ్యూనిస్టులికి రుచించలేదు. ఫ్రెంచివారు పూర్తిస్వాతంత్ర్యం ఇవ్వడానికి అంగీకరించలేదు. రాజీకి ముందు ఫ్రెంచివారు దేశాన్ని విడిచిపోవాలని షరతుపెట్టారు. అది ఫ్రెంచివారికి రుచించదు. అమెరికన్ల మద్దతు ఉండగా ఫ్రెంచివా రెందుకు దేశం విడిచిపోతారు ?

అయితే ఫార్మోజాలో అమెరికన్లుచేరి కొమింటాంగ్ ప్రభుత్వంపట్ల వారే షాంఘై మొదలైన నగరాలపైన విమానదాడులు జరుపుతున్నారనీ, ఫార్మోజాసంరక్షణకు అమెరికన్ సైనికులే సన్నాహాలు చేస్తూ పూర్తి బాధ్యత వహిస్తున్నారనీ చీనాకమ్యూనిస్టులు ఆరోపిస్తున్నారు. ఈప్రచారంలో నమ్మకూడని దేదీ లేదు. చియాంగ్ కై షేక్ పేరుతో ఫార్మోజానుంచి, లై చంగ్ జెన్ పేరుతో వీలైతే చీనాభూభాగంలోనే గొరిల్లాల సహాయంతోను, తామే స్వయంగా కమ్యూనిస్టులపైన యుద్ధం జరపడానికి అమెరికన్లు సిద్ధపడుతూనే ఉన్నారు. ఈ విషయాల్ని వా రేమంత గోప్యంగా కూడా ఉంచడంలేదు. షాంఘైనగరంపైన విమానదాడులు జరిపే ది ఫార్మోజాలోని చియాంగ్ విమానదళం. విమానాలు అమెరికానుంచి సరఫరాఅయినవి. బాంబులు అమెరికానుంచి వచ్చినవి. విమానాల్ని నడిపేవారు అమెరికన్లు. ఫార్మోజానుంచి విమానదాడుల్ని నిర్ణయించేవారు అమెరికన్ సైనికనిపుణులు.

కాని చీనాలో విమానాలు కురిపించే బాంబులవర్షంనించి నగరాల్ని ప్రజల్ని కాపాడుకోడానికిగాను విమానాల్ని పడగొట్టే పెద్దఫిరంగుల్ని కాల్చడానికి రష్యన్ నిపుణులు” వస్తున్నారనీ, ఆసియావ్యవహారాల్లో రష్యన్లు జోక్యంచేసుకుంటున్నారనీ, చీనా రష్యాచేతిలో కీలుబొమ్మయిందనీ అమెకన్లు ప్రచారంచేస్తున్నారు. దీనికి ప్రతిగా బావోదాయ్, ఫిలిపైన్స్, చియాంగ్ కై షేక్ ప్రభుత్వాలు అమెరికన్ సామ్రాజ్యవాదుల బానిసలని కమ్యూనిస్టులు ప్రచారం చేస్తున్నారు.

### పూరిగుడిసెలమీద బాంబులు : *

అమెరికన్లు తమ కార్యక్రమాన్ని తూర్పు ఆసియాకంతకీ వర్తింపచెయ్యడానికి యత్నిస్తున్నారు. ఇందుకుగాను “టెక్నికల్ మిషన్” అనేపేరుతో అమెరికన్ సైనికాధికారులు మలయాలో బ్రిటిష్ హైకమిషనర్ మాల్కొం మాక్డొనాల్డ్‌తో సంప్రదింపులు జరుపుతున్నారు. మలయా, సయాం, వియత్‌నమ్, ఇండొనీషియాలలో కమ్యూనిస్టుల్ని అణచడానికి కార్యక్రమాలు నిర్ణయిస్తున్నారు. ఏ దేశాని కెన్ని తుపాకులు కావాలో అమెరికాలో భారీపరిశ్రమలకి కంట్రాక్టు లివ్వడానికి ఏర్పాట్లు చేస్తున్నారు.

మలయాలో బ్రిటిష్‌వారి కార్యక్రమం సంతృప్తికరంగా కొనసాగుతోంది. “దోపిడిగుంపుల్ని” నిర్మూలించడానికిగాను ఒక మాసానికి పూర్తి కార్యక్రమం నిర్ణయమై ఇదివరకే ప్రారంభమయింది. ఈచిన్నగస్తీ కార్యక్రమంలో బాంబర్లుకూడా ఉపయోగిస్తున్నారు. కొండచరియల్లో ఉన్న కార్మికులవలసలపైన, అంటే “కమ్యూనిస్టుల స్థావరాలపైన” బాంబులు వేస్తున్నారు. బ్రిటిష్ యజమానుల రబ్బరుతోటలు, తగరపు గనుల్నుంచి మేనేజర్లని వెళ్లగొట్టి పరిశ్రమల్ని స్తంభింపచేసిన “బందిపోటుల్ని” ఆ తోటల్లోనుంచి వెళ్లగొట్టడానికి విమానాల్లో వెళ్లి బాంబులు వేస్తున్నారు.

కమ్యూనిస్టుప్రమాదం అంతగా లేదని చెప్తూనే ఈకార్యక్రమం కొనసాగిస్తున్నారు. మలయా అంతటా బ్రిటిష్‌వారి పరిపాలనకు ఎక్కడా అటంకంలేదని చెప్తూనేఉన్నారు. అయినా ఉత్తరతీర ప్రాంతంలో సైనికులు ప్రవేశించేముందు బాంబులు వెయ్యవలసివస్తోందిట.

### కొత్త పద్ధతి : *

ఆసియాలోనూ, యూరప్‌లోనూ ఆఫ్రికాదక్షిణమెరికాల్లోనూ కూడా కమ్యూనిజాన్ని అరికట్టడానికి అమెరికన్ ప్రభుత్వం సర్వవిధాలా యత్నించగలదని చెప్తూ విదేశాంగమంత్రి డీన్ ఆఛిసన్ ఒక ప్రకటన చేశాడు. అంటే ఆర్థికసహాయమిస్తూ సైనికకార్యకలాపాల్లో అమెరికన్ ప్రభుత్వం ఆదేశాల్ని పాటించాలని, ఇకనుంచి అంతర్జాతీయవ్యాపారరవాణాల విషయాలలో అమెరికా చెప్పుచేతల్లో ఉండని దేశాలపట్ల కొత్తవిధానం అవలంబించాలనీ, ఆఛిసన్ విశదీకరించాడు. తరవాత చీనాగురించి ఉపన్యసిస్తూ, తూర్పు ఆసియావ్యవహారాల్లో (ముఖ్యంగా ఇండోచీనా మలయాలలో) చీనా జోక్యం చేసుకోడానికి వీల్లేదని హెచ్చరించాడు. దీనికి సమాధాన మిస్తూ చీనాప్రధానమంత్రి చౌఎన్‌లై, ఆసియావాసుల వ్యవహారాల్లో అమెరికన్లు జోక్యం చేసుకోవలసిన అవసరం లేదన్నాడు. ఆసియా వ్యవహారాల్ని ఆసియావాసులే నిర్ణయించుకోవాలన్నాడు.

### క్షామం : *

క్షామదేవతకి పుట్టిల్లయిన చీనాదేశంలో కమ్యూనిస్టుల పరిపాలన ప్రారంభమైన మొట్టమొదటి సంవత్సరంలోనే కని విని ఎరుగనంతటి క్షామం వ్యాపించింది. క్షామంవల్ల అనేకలక్షలమంది బాధపడుతున్నారు. కొమింటాంగ్ ప్రభుత్వం తుది దినాల్లో వచ్చిన యెల్లోనదివరదలు మాత్రమే దీనికి కారణం కాదు. కమ్యూనిస్టుసైన్యాలు దేశాన్ని ఆక్రమించుకుంటున్నప్పుడు పారిపోతున్న కొమింటాంగ్ సైన్యాలు దొరికినంతవరకూ ధాన్యపు రాసుల్ని అన్నిటినీ ధ్వంసంచేసి వెళ్లారు. సైనికులకంటే ప్రజలే ఎక్కువగా యుద్ధాలకి బలయ్యే ఈరోజుల్లో ఇదేం వింత కాదు.

### భారతరాయబారి : *

భారతదేశం, చీనాప్రభుత్వాల మధ్య సమాలోచనలు ముగిశాయనీ, ఇదివరలో నాంకింగ్ ప్రభుత్వంవద్ద భారతరాయబారిగా ఉన్న సర్దార్ పణికర్‌నే పెకింగ్‌లో రాయబారిగా నియమించడానికి అంగీకారం కుదిరిందనీ భారతప్రభుత్వం ప్రకటించింది.

### స్టాలిన్ వారసుడు :

వృద్ధాప్యం ఆవహించిన స్టాలిన్‌కి విశ్రాంతి నివ్వడంకోసం పరిపాలనాధికారంలో చాలవరకు మొలటోవ్‌కు ఒప్పగించబడిందని వార్త వచ్చింది. లెనిన్ అనంతరం బలవత్తరమైన సైనికబలాన్ని నిర్మించి, బ్రహ్మాండమైన ఆర్థికప్రణాళికల్ని అమలుజరిపి సోవియెట్‌రష్యాని ప్రపంచంలోకల్లా బలవత్తరమైన రాజ్యంగా

# మనరాష్ట్రం, మనదేశం

(4-వ పేజీ తరువాయి)

అనుమానాలకి ఎందు కవకాశ మివ్వాలో బోధపడకుండా ఉంది. మంత్రివర్గం ఇటువంటి విషయాల్లో కాకపోతే మరేవిషయాల్లో జాగ్రత్తపడాలో తెలియడంలేదు. ఆపైన ఎవరైనామంత్రులు పక్షపాత బుద్ధితో ప్రవర్తిస్తున్నారని నిందిస్తే ఎంత నొచ్చుకుని ఏమి లాభం?

అన్నిటికంటె పెద్దలోపం, కమ్యూనిస్టుల జాడల్ని పోలీసుశాఖవారు కనిపెట్టలేకపోవడం, కనిపెట్టలేక ప్రజలు సహాకరించడంలేదని వారిని హింసించడం, కమ్యూనిస్టులు చేతికి అడ్డొచ్చిన వారి నల్లా చంపడంలేదు. వారు కొందరిపైన పగబట్టి హత్యలు చేస్తున్నారు. తమపైన పగబట్టి పోలీసులకు సహాయం చేస్తున్నవారిని హింసిస్తున్నారు. ఈ పరిస్థితుల్లో హింసించబడేవారిని రక్షించలేకపోవడం దాడిచేసే వారిని కనిపెట్టలేకపోవడం సి. ఐ. డి. శాఖవారి అసమర్థతను నిరూపిస్తోంది. పోలీసుశాఖవారు సి. ఐ. డి. శాఖలోనైనా కులనిష్పత్తిని మాని సమర్థులైనవారిని, ఆ ప్రాంతాలతో పరిచయంగలవారిని, అక్కడి పరిస్థితుల్ని అర్థం చేసుకోగలవారినీ నియమించవలసిన అవసరం ఉంటుంది.

## కాలేజీల్లో తెలుగు :

ఆంధ్రదేశంలోని కాలేజీల్లో సైన్సులు, ఎకనమిక్స్, మేథమేటిక్స్, హిస్టరీ, లాజిక్ వగైరా సబ్జక్ట్సనీ బోధించడానికి వీలైనంత త్వరలో ప్రారంభించాలని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఎకాడెమిక్ కౌన్సిల్ తీర్మానించింది. తెలుగులో బోధించడానికిగాను భారతదేశభాషలన్నిటికీ సమానమైన పారిభాషికపదాల నిఘంటువు ప్రచురించబడినతరవాత, ఆపారిభాషికపదాల సహాయంతో అన్ని సబ్జక్ట్సకీ సంబంధించిన టెక్స్టు పుస్తకాల్ని తెలుగులో అచ్చువేస్తారు. ఆ తరవాత కాలేజీల్లో ముందుగా ఇంటర్మీడియెట్‌లో తెలుగుద్వారా అన్నివిషయాల బోధన ప్రారంభిస్తారు. అదైన రెండేళ్ళకి బి. ఏ., బి. కాం., బి. యస్‌సి., యం. బి. బి. యస్., బి.ఇ (ఇంజనీరింగు) వగైరా అన్నిటా తెలుగుద్వారా బోధన ప్రారంభిస్తారు. విద్యార్థులకోరిక ననుసరించి తెలుగులో కాకపోతే, హిందీలోనూ, ఆప్రాంతంలో వాడుకలో ఉండే మరొక ప్రాంతీయ భాషలోనూ కూడా బోధనకు ఏర్పాట్లు చెయ్యగలరు. లాకాలేజీల్లో మాత్రం పదిహేనేళ్లవరకూ ఇంగ్లీషులోనే బోధన జరుగుతుంది. కోర్టుల్లో పదిహేనేళ్లవరకూ న్యాయవిచారణాది వ్యవహారాలు ఇంగ్లీషులోనే జరుగుతాయికాబట్టి, ఆపైన కోర్టుల్లో ఏభాషను వాడతారో ఆ భాషలో లాకాలేజీలో న్యాయశాస్త్రం బోధిస్తారు.

అయితే క్రమక్రమంగా జరగవలసిన ఈ కార్యక్రమాన్ని ఉపక్రమించడానికి ముందు ఈ కార్యక్రమంలో మొదటిమెట్టు, అనగా తెలుగులో టెక్స్టుబుక్స్ అన్నిటినీ ప్రచురించడానికి ముందు, భారతప్రభుత్వం ఆధ్వర్యంకింద పారిభాషికపదనిఘంటువు అచ్చుకావాలి. తెలుగులో బోధన జరగడంతో ప్రజాప్రాతినిధ్యపరిపాలనావ్యవస్థలో నూతనశకం ప్రారంభమౌతుంది నిజమే. కాని అది ఏటంబాంబు పుట్టిన తరవాత పుట్టినవారితరంలో ప్రారంభమైతే మేలే.

## ఆదివారం టపా :

ఏప్రిల్ 1 నుంచి పోస్టాఫీసు లన్నిటికీ ప్రతిఆదివారం పూర్తిగా సెలవు ఇవ్వగలరని పార్లమెంట్‌లో తపాలాశాఖమంత్రి రఫీ అహ్మద్ కిద్వాయ్ ప్రకటించారు. ఆదివారంకూడా టపా తియ్యడానికీ, ఇవ్వడానికీ అదనంగా రెండుకోట్ల రూపాయలు ఖర్చవుతుందని వారు చెప్పారు. ఆ ఖర్చు పెట్టడం ఇష్టంలేక ఆదివారంనాడు తలుపులు మూసివేస్తారట. నిత్యమూ ఆలస్యంగా టపాచేరవేసేవారు మరొక్కరోజు ఆలస్యంచేస్తే ఏంపోయిందిలే అనిపిస్తుంది. కాని బస్తీల్లోనూ వ్యాపార ప్రధానప్రాంతాల్లోనూ, అవసరసమాచార వితరణలోనూ దీనివల్ల చాలా ఇబ్బంది కలుగుతుంది. అదీకాక శనివారంనాడు ఆదివారంనాడు పెట్టెలో వేసిన టపా ఆదివారంనాడు కదలదు. ఆదివారంనాడు చేరిన టపా సోమవారందాకా కదలదు. మొత్తానికి సోమవారంనాడు బట్వాడా చేసేవారి టపామూట మోపెడౌతుంది.

కిద్వాయ్‌గారు రెండుకోట్లరూపాయలూ ఖర్చులేకుండా, ఆదివారానికి బదులు ఒకరోజు సెలవు అందరికీ ఏడురోజుల్లో ఒక్కొక్కరోజు చొప్పున ఇస్తూ నిర్వహించడం ఎలా కష్టమౌతుందో తెలియదు. ఇకనించి రెండురోజుల తరవాత మూడోరోజునైనా అందుకున్న ఉత్తరాలు నాలుగోరోజుకి అందుతాయని అంచనా వేసుకుని చేరవలసిన రోజుకి నాలుగురోజులు ముందుగా ఉత్తరాలు రాసుకుందాం.

## తెలుగులో తంతి :

ఢిల్లీనుంచి చెన్నపట్నానికి తెలుగు, తమిళ భాషల్లో తంతివార్తలు పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయని కూడా కిద్వాయ్‌గారు పార్లమెంట్‌లో తెలిపారు. తెలుగుదేశంలో కూడా ఈమాదిరి ఏర్పాటు చెయ్యగలిగితే వ్యాపారస్థులకీ తదితరులకీ సౌకర్యంగా ఉంటుంది.

[సీతారామ్]

---

నిర్మించి, ఇంతవరకూ ప్రపంచంలో ఏ మానవుడూ చలాయించనంతటి నియంతృత్వాధికారాన్ని చలాయించిన స్టాలిన్‌కి వారసు డెవరౌతారనే విషయంపైన చాల కాలంనుంచీ అనేకమంది ఊహిస్తూవచ్చారు. ప్రపంచంలో ఆరోవంతుజనాభాపైన నియంతృత్వాధికారంకోసం రష్యన్ నాయకులమధ్య ప్రచ్ఛన్నపోరాటాలు మొదటినుంచీ సాగుతూనే ఉన్నాయని చెప్పేవారు. ఒకప్పుడు ఝుడానోవ్ స్టాలిన్ వారసు డౌతాడనుకున్నారు. యూరోపియన్ అమెరికన్ రాజ్యాలతో సోషలిస్టురష్యాకి సఖ్యత కుదరదని చెప్తూ, ఆరీతిగా రష్యావిదేశాంగవ్యవహారాల్ని నడపడానికి అతడే కారకుడని ప్రతీతి. కాని అతడు ముందే చనిపోయాడు. తరవాత మోలటోవ్ విదేశాంగ మంత్రిగా అదే విధానాన్ని అనుసరించాడు, పైపైకి సఖ్యత ప్రదర్శిస్తూ అంతర్యంలో తద్విరుద్ధంగా ప్రవర్తించడానికి మోలటోవ్ ముఖ్యకారకుడు. స్టాలిన్ తరవాత అతడే వారసుడని భావించారు. కాని ఈవిషయం తుదివరకూ ఖచ్చితంగా నిర్ణయం కాకపోవచ్చును. [సూర్యనారాయణ]

# ఆదికవి-ఆదికావ్యం

(8 వ-పేజీ తరువాయి)

హితంగా జరుగుతూఉండే వృత్తాంతమే, వాల్మీకి చిత్రించాడు. ఆ కారణంచేతనే తక్కిన ఏ కథలకన్నా కూడా ఆ కథ అంత సన్నిహితమూ, అంత ప్రబలమూనూ!

ఉత్తమపురుషుని స్వరూపనిర్ణయానికి ప్రతిదేశంలోనూ ప్రతియుగంలోనూ కవికుమారులూ, ఋషులూ ప్రయత్నిస్తూనే ఉన్నారు. నేటి హాలీవుడ్‌లో తయారైన మంచిచిత్రమైనా, ప్రాచీనకాలంలో దేశదేశాల పురాణకవులు రచించిన కావ్యాలైనా, మానవుడు శాశ్వతత్వ మందుకోటానికి గల ఉత్తమమానవస్వభావరూపాలేవో, వాట్లని ఊహించి చిత్రించటానికే ప్రయత్నించాయి. ఈయత్నంలో కర్మభూమిలో జన్మించిన విశేషంవల్ల, భారత ఋషులు, ఊహించినంత ప్రజ్వలంగా ఉత్తమమానవస్వభావాన్ని తక్కిన దేశాల పురాణకర్తలు ఊహించలేకపోయారేమో, నని, అథమం మనకైనా అనిపిస్తుంది హోమర్ పురాణాలలో ఉత్తమపురుషుడుగా నిలచేవాడు యులిసిస్, వీరుడు, యుక్తిశాలి, లోకప్రజ్ఞుడు. కాని నైతికబలం కన్నా బుద్ధిబలంపైనే మోజు మెండు. యుద్ధంలో విజయాన్నిమించిన ఆదర్శం లేదు. ఆకథలలోని తక్కిన పేరులలో, ఒక్కొక్కవిశేషప్రజ్ఞ, సౌందర్యమో, సాహసమో, దాతృత్వమో, ధైర్యవిశేషమో, ఏవో ఒక్కొక్కటో, ఒకటి రెండో కనబడతాయి. పౌరుషంతోపాటు శమదమాదిగుణాలు, సాహసౌదార్యాలు, వినయగాంభీర్యాలు, సత్యధర్మపరాయణతలు, నైతికదీక్ష, ఆశ్రితరక్షాస్వభావము, తనకెంత కష్టమైనా పితృవాక్యపరిపాలనతో పాటు, జనప్రతినిధియైన సామాన్య రజకుని వాక్యం ఆదరించి పాలించే నిర్భీతనమూ, సహనమూ, ఆత్మశిక్షణ—మొదలైన సద్గుణపుంజాలన్నీ ఒకచోట మూర్తీభవించిన, ఉత్తమమానవశీలాన్ని భావించినవారు విదేశపౌరాణికులలో అరుదు.

ఉత్తర ఐరోపా ఖండపురాణవీరులలో సీగ్‌ఫ్రీడ్‌లో, శూరత, వీరత్వము, స్నేహపాత్రతలతోపాటు, రక్తదాహము, శత్రువులపట్ల తగిన ఔదార్యము లేమి, శమదమాది ఆత్మబలసంపన్నమైన గాంభీర్యమూ కనబడవు. ఐగుప్త, బేబిలోనియన్, అరేబియన్ వీరుల కథలలో కూడ, దేహబలము, బుద్ధిబలము, సంఘమర్యాదా లక్షణములైన, అభిజాత్యగుణాలుతప్ప, నైతికము, ఆత్మబలసంపన్నమూ అయిన ఉత్తమశీలప్రకృతి కనబడదు.

పోనీ ఈ గుణాలలో మాచుకొన్న ఒక్కొక్క సద్గుణంగాని దుర్గుణంగాని వ్యక్తులలో పరమావధిని బొందించిన పురాణకవులు భారతఋషులై ఈ వ్యాసవాల్మీకుల పాటికి రాగలవారు కనబడరు. రాముని వ్యక్తిలో అట్టి గుణపుంజాలన్నిటినీ, స్వభావవికృతిగాని, అత్యుక్తిదోషంగాని అంట నీయకుండా మానవసహజమైన శీలంలోనే పొదిగి "ఉత్తమపురుషుణ్ణి" సృజించాడు వాల్మీకి.

ఒక్క రాముడే కాదు. సీత, రాముని కన్నా కూడా భారతహృదయానికి సన్నిహితం. ఆ కథలోని పాత్రలందరూ, అంత ప్రత్యేకవ్యక్తులే. వేదోక్తవిజ్ఞానమూ, స్వధర్మనిష్ఠ, త్రైలోక్యాధిపత్యాన్ని మించిన ప్రతాపమూ, మొదలైన సహజరమ్యత్వాలెన్ని ఉన్నా కూడా, సంఘపురోగమనానికి వ్యతిరేకుడై, రాక్షసుడయ్యే వ్యక్తి కూడా, ఎంతటి భీకరమైన ఆకర్షణతో కనబడి మానవస్వభావాన్ని ఒకటి రెండులోట్ల వల్ల ఎంత సంఘానికి ప్రళయప్రదంగా, చేయగలడో, రావణునిలో మహోత్కృష్టవిధానంలో చూపిస్తుంది రామాయణకథ. సంపూర్ణమానవత్వానికి ఏమాత్రం చీలి ప్రక్కకు నడిపించే గుణాలైనా మానవజీవాభివృద్ధికి, పురోగమనానికి, భద్రరక్షగా తయారుకాగలవని భారతఋషులు కావ్యప్రమాణంగా చూపించినంత సుస్పష్టంగా మరేదేశపౌరాణికులూ చూపలేదు. అందుచేతనే వాల్మీకి ఆదికవి అయ్యాడు. ఆదికావ్యం రామాయణమయింది. ఉత్తముడు రామచంద్రుడయ్యాడు.

# కా. నాగేశ్వరరావుగారు

(5-వ పేజీ తరువాయి)

అదీకాక బస్తీలలో పిల్లడికి చదువుకన్నా తక్కిన వేషాలబ్బుతాయని భయం. అందుకు తగినట్టుగానే, ఈ లలితకళాప్రియుడు నాటకాలలో వేషాలుకూడ ప్రారంభించాడు. తండ్రి కోపగించుకొన్నాడు. కాని తల్లిపట్టుదలతో కొడుకును మెట్రిక్యులేషన్ దాకా తండ్రి చదివించారు. 1885 లో నాగేశ్వరరావుగారు మెట్రిక్యులేషన్ ప్యాసయాడు. ఆ సంవత్సరమే తండ్రి మరణించారు.

తల్లి అధీర కాలేదు. కొడుక్కి చదువు పూర్తిగా చెప్పించాలని ఆమెఅభిలాష. గుంటూరు కాలేజిలో యఫ్. ఏ. చదివించింది. 1888 లో ఎఫ్. ఏ. పరీక్షలో ప్యాసయాడు. అక్కడినుంచి మద్రాసు క్రిస్టియన్ కాలేజీకి వచ్చి బి. ఏ. చదివారు. క్రిస్టియన్ కాలేజీ ప్రిన్సిపాల్, మిల్లరుగారు, తన క్రింద శిక్షణలో చాలామంది యువకుల మనస్సులు పండించి ప్రతిభావంతులను చేశాడు. 1890 లో మద్రాసులో చదువుకొంటున్నరోజులలో నాగేశ్వరరావుగారి వివాహమయింది. రెంటాల సుబ్బారావుగారి మేనకోడలు, క్రిష్ణాజిల్లా, బొమ్మలూరి కరణంగారైన మల్లాప్రగడ వెంకటరత్నంగారి కుమార్తె రామాయమ్మగారిని వివాహమాడారు. 1892 నాటికి చదువు చాలించి, స్వయంకృషికల్ల జీవితం సాగించుకోవాలనే కోర్కెతో బొంబయి వెళ్లారు. ఒక డెబ్బది రూపాయల ఉద్యోగంలో చేరారు. అక్కడ పరిస్థితులు కలిసిరాలేదు. 1894 లో కలకత్తాలో దారన్‌దొరగారివద్ద చేరి రెండేండ్లు వ్యాపారంలో ఉన్నారు. కాని ఆరోగ్యం సరిగా లేదు. ఊపిరితిత్తులవ్యాధితో 1896 లో మద్రాసు తిరిగివచ్చారు. 1897 వ సంవత్సరంలో ఒక కుమారుడు జన్మించి పోయాడు. 98 లో మళ్లీ బొంబయి బయలుదేరారు. తన కున్న ఆయుర్వేదవిజ్ఞానంతోనూ, మేనమామ ఇచ్చిన వ్యాపారఉత్సాహంతోనూ, 'విలియమ్సు' అనే మందులకంపెనీ నడుపుతూ తెలుగుమందులను తయారుచేస్తూ అమ్ముతూండేవారు. 1899 లో "అమృతాంజనం" తయారుచేశారు. అప్పటి ఆ కంపెనీపేరు జిట్టిపాడ్వాజెల్ కంపెనీ. అమృతాంజనం తక్కిన మందులకన్నా వ్యాపారాన్ని వృద్ధిలోకి తేసాగింది.

1902 లో వీరి తల్లిగారుకూడా చనిపోయారు. తన కొడుకు విద్యాభ్యాసంకోసమని ఆమెపడ్డ తపన, ఆ కుమార్డు మరిచిపోలేదు. ఆమెపేరిట 1911లో, యలకుఱ్ఱులో శ్యామలాధర్మవిద్యావిశాల అని మాధ్యమిక తరగతులవరకు ఉచితవిద్యాదానంచేస్తూ హరిజనులకందరికీ ప్రవేశముండే విద్యాశాల స్థాపించి, బీదతల్లుల పిల్లలకు విద్యావకాశం కల్పించి, వారి ఆకాంక్ష తీర్చి, తద్ద్వారా తల్లి ఋణం తీర్చుకొన్నారు.

1907 సంవత్సరములో వినాయకచతుర్థినాడు బొంబయినుండి "ఆంధ్రవారపత్రికను" ప్రారంభించారు. అప్పటికి ప్రముఖంగా ఏ దేశోద్యమముఖాన్నా వీరు నిలవకపోయినప్పటికీ, పత్రికలోని ప్రచారమంతా దేశస్వాతంత్ర్యము, దేశాభివృద్ధి, హరిజనసేవ మొదలైన కాంగ్రెస్ఆదర్శాలతో నిండి ఉండేది. కాంగ్రెస్ కాని తదితర విప్లవపక్షాలకు వేటికీగాని చెందినవాడుగా ఈయన ప్రభుత్వానికి కనబడకపోయినా, ఈయన పత్రికలను ప్రభుత్వంవారు అనువదింపచేసుకొని ఒకకంట గమనిస్తూనే ఉండేవారు.

వారపత్రికమాత్రంతో పంతులుగారికి తృప్తి కలగలేదు. ప్రథమప్రపంచసంగ్రామారంభంలోనే, 1914లో దినపత్రికనుస్థాపించే ఉద్దేశంతో మద్రాసువచ్చి, ఉగాదినాడు దినపత్రికగా ఆంధ్రపత్రికను స్థాపించారు.

ప్రజలలో వార్తాచైతన్యమూ, ప్రచారచైతన్యమూ, కలిగించాక, ఉత్తమ సాహిత్యపత్రికను తెలుగులో నెలకొల్ప సంకల్పించి 1924 లో "భారతి" పత్రికను స్థాపించారు.

1915లో వీరికి కుమార్తె జన్మించారు. ఆమెతర్వాత 1920 లో మళ్ళీ ఒక కుమార్డు జన్మించాడు. కానీ పంతులుగారికి పుత్రసంతానము మిగులలేదు. 23, 24 సంవత్సరాలలో సకుటుంబంగా బయలుదేరి కాశీరామేశ్వరాదితీర్థయాత్రలు చేసికొంటూ, హరిద్వారము మొదలైన హిమాలయప్రాంత పుణ్యక్షేత్రాలలో ఎక్కువకాలం నిలుస్తూ, దేశమంతా పర్యటించారు.

అప్పటికే, సర్వరాజకీయోద్యమాలలోనూ ఆంధ్రోద్యమాలలోనూ, సర్వవిధమైన జాతిచైతన్యకృషులలోనూ, ఆయన అగ్రస్థానంలో నిలిచిఉన్నారు. ఆంధ్రమహాసభ రాష్ట్ర కాంగ్రెస్ సభలకు అధ్యక్షస్థానంలో నిలిచాడు. దేశోద్ధారకుడని ఆంధ్రప్రజ అభినందించింది. మహాత్ముడాయనకు "విశ్వదాత" నామకరణ మొనర్చాడు. 1930లో, అరవైమూడోఏట, ఉప్పుసత్యాగ్రహముఖాన్న నిలిచి జైలుకు వెళ్లాడు. మళ్ళీ 1932లో మరొకమారు జైలు. 1936లో కేంద్ర శాసనసభకు సభ్యుడయ్యాడు. చనిపోయే ముందురోజుల్లోనే అనారోగ్యకారణంగా ఈ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు.

బహుధాన్యనామసంవత్సర చైత్ర శుద్ధ ఏకాదశినాడు (11-4-1938) శ్రీ నాగేశ్వరరావుగారు శివసాయుజ్యం పొందారు. ఆయన నిర్యాణవార్త విని మహాత్ముడీ సందేశ మిచ్చాడు. "నాగేశ్వరరావుగారి నిర్యాణమువలన దేశమునకు వాటిల్లిన నష్టమపారము. అసంఖ్యాకులకు ఆర్తజీవులకు గుప్తదానముచేయు నీ దానకర్ణుని స్థానమాక్రమింపగలవారింకెవ్వరు?"— ఈనాటికీ ఎవరూ లేరు!



ఇండియా, అమెరికాలమధ్య విద్యా సంబంధములను స్థిరపరుచుకుంటూ జరిగిన ఒడంబడికపై ఫిబ్రవరి 2న అమెరికన్ రాయబారి, లాయ్ హెండర్సన్, భారతప్రధాని నెహ్రూ సంతకాలుచేశారు. ఆ సందర్భాన తీయబడిన ఈ చిత్రంలో హెండర్సన్, నెహ్రూ, అజాద్ గార్లు. ఎడమనుండి కుడికి నుంచున్నవారిలో అమెరికన్ ఉద్యోగులు జెఫర్సన్ జోన్స్, జాన్ స్టీవ్స్, భారతీయోద్యోగులు సి. ఎస్. ఝా. ఐ. ఎస్. చోప్రా, శ్రీమతి రామ మెహతా, డా॥ తారాచంద్ ఉన్నారు.

---

మద్రాసు కార్పొరేషన్ కమీషనర్ శ్రీ పి. నరసింహంగారి పదవి కాలం మరి మూడు సంవత్సరాలకు పొడిగించబడింది. ఆ సందర్భంలో వారికి విందిస్తూ జరిగిన అల్పాహారవిందులో నరసింహంగారు ప్రసంగిస్తున్నారు.



Regd. No. M. 4479

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## ప్రథమ ద్వితీయ సంపుటములు

ప్రథమసంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౬౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్యు" వరకును గలవిషయము గలదు. త్రివర్ణపటములు ౮, ఇతర పటములు ౧౨౫, వివిధ విషయములు ౮౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౬౦౦ లకు మించిన పుటలు కలవు. "అన" మొదలుకొని "అశ్విని" వరకు గలవిషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౨ అమరావతీ స్తూపమునకును, ౨ అనాహతమునకును చెందినవియు, ౬ దేశచిత్రపటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదా దేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీస్తూపమును గురించిన గొప్ప వ్యాసమునందు అమరావతీశిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయ మను వ్యాసమున భరతశాస్త్రమునందలి వేఱు వేఱు హస్తములను సూచించు బొమ్మలు ౫౭ ను, 'అనాహతము' నందు షట్చక్రాదుల చిత్రములును గలవు. ఇట్లు ఆ యా వ్యాసములకు చెందిన చిత్రములును మొత్తము మీఁద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధ విషయముల సంఖ్య ౮౦౦ వరకు నుండును. సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను, బంగారురేఖలతోడను సంపుటీకృతము. ప్రతి సంపుటమున ౬౦౦ పుట లుండును.

## ప్రతి సంపుటము వెల రూ. ౧౦.

పోస్టు ఖర్చులు: రూ. ౧-౮-౦.

రైలు ద్వారా దగ్గర చోట్లకు ఖర్చులు అ. ౧౨.

---

మేనేజరు,

## ఆంధ్రవిజ్ఞానసర్వస్వకార్యాలయము,

నెం. 7, తంబుశెట్టివీధి, మదరాసు 1.

Editeb, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7 Thambu Chetty St., Madras.